

Chandamama, January '51

Photo by N. Ramakrishna

భాతుల యాతలు


అతి త్వరలో విడుదల...

చందమామ

ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవన్నీ గాక బొమ్మల పజిలు, ముగ్గులు, చిక్కు బొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు 1686
మద్రాసు.1.




మీ మామూలు ఆహారమునకు ఇది ఒక శాస్త్రోక్తమైన చేర్పు. 'ఆల్బో-శాంగ్' గొప్ప గుణమునిచ్చు. తరతముగ పని చేసే మధురమైన టానిక్కు. దీని వాడుకచే అగ్నిమాంద్యము పోవును, రక్తము వృద్ధి అగును, తూకము హెచ్చును. ఇది పిల్లలకు, పెద్దలకు ఒక్క విధముగా గుణము నిచ్చును.

# Albo-Sang

FOR BALANCED NUTRITION

Price Rs. 1/2 : 3/- & 7/8.

**J. & J. DeChane**

RESIDENCY ROAD, HYDERABAD - Dn.








సంపుటి 8 సంచిక 1

జనవరి 1951

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి



ఈ నెలలో మనకు సరదానిచ్చే పెద్దపండగ వస్తున్నది. పండగ మూడు రోజులు—భోగి, సంక్రాంతి, కనుము. భోగినాడు చెత్తా చెదారమూ భగభగ మండే జ్వాలలలో వేసి భస్మం చేసి, ఇళ్లు పరిశుభ్రంగా ఉంచుకొంటాము. సంక్రాంతి అనగా సంక్రాంతిపురుషుణ్ణి సమారాధనచేసే గొప్ప పర్వం. లేనివాళ్లైనా ఆరోజున వైభవంగా గడపాలె నని ప్రయత్నిస్తారు. దీనినే ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించడమంటారు. పోతే మూడవరోజు కనుము పశువుల పండగ. దీన్ని అరవవారు 'మాట్టు పొంగలి' అంటారు. ఈ నాడు పవిత్రమైన గోపూజ జరుగుతుంది. ముఖ్యంగా నేపాళదేశంలో పిల్లలూ, పేరంటాళ్లూ చేరి పశువులకు పసుపు కుంకుమలు బొట్టుపెట్టి, ప్రదక్షిణాలు చేసి, వాటిని భక్తితో ఆరాధిస్తారు. ఇన్నిన్ని సంతోషాలను సమకూర్చే శుభప్రదమైన సంక్రాంతి సమయంలో పిల్లలకూ పెద్దలకూ చందమామ జేజేలు!!






# పిసినిగొట్టు

ఒక ఊళ్లో ఉన్నాడొక
పిసినిగొట్టు షావుకారు.
అతనివద్ద చాలాధన
ముందని ఊళ్లో పుకారు.

కాని అతడు పిల్లికైన
బిచ్చం పెట్టడు ఎన్నడు.
తాను తినడు కడుపారా
ఇంకొకరిని తిననివ్వడు.

పెళ్లాం బిడలా లేరు
దానధర్మమా చేయడు
బంగారంకొని చాలా
పాతరవేశాడాతడు.

పిట్టకైన తెలియకుండ
రోజు పాతరున్నదారి
వెళ్లొచ్చేవాడాతడు
తప్పనిసరి ఒక్కతూరి.

ఇట్లుండగ దొంగ ఒకడు
కనిపెట్టా డతని కిటుకు.
'బలే ఛాన్సు దొరికిం'దని
అనుకొన్నాడు తనమటుకు.

రచన:
"బైరాగి"

ఒక్క రాత్రి వచ్చి అతడు
మెదలకుండ పాతరలో
బంగారం కొల్లగొట్టి
పోయాడెంతో త్వరలో.

ప్రొద్దున్నే పిసినిగొట్టు
వస్తే ఇంకేమున్నది?
ఘొల్లున ఏడవసాగా
డింక పిచ్చివాని పగిది.

ఎవరో ఇదిచూసి ఎందు
కేడుస్తున్నా వనగా
ధనమంతా పోయిందని
అన్నా డందరు వినగా.

ధన మున్నప్పుడు దాన్నేం
చేశా వన్నారు వారు.
'రోజూ చూసేవాడిని'
అన్నా డా షావుకారు.

'ఇంకేం, ఆ డబ్బు బదులు
చూడిక ఖాళీపాతర'
అని ఎవరో ఒక రసగా
ఫక్కున నవ్వా రందరు.





# వదినతో సరసాలు

"మహేశ్వర్" (మద్రాసు)

ఆటల్లోను అంటిపండు పాటల్లోను పనసపండు
మాటల్లోను మా వదినా మామిడిపండు!
అన్నా తెచ్చిన గోవాపళ్లూ కావాలంటుంది
అత్తా తెచ్చిన మినపాసున్నీ మెక్కానంటుంది!
వదినా వదినా వరాల వదినా కదలానంటుంది
దాగుడుమూతా లాడాలంటే మెదలానంటుంది!
అన్నావెంటా షికారుకైతే వదలానంటుంది!
కొత్తా మొగుడూ పలకారిస్తే సిగ్గూ పడుతుంది
కొంచెం కొంచెం మచ్చికచేస్తే మెత్తాపడుతుంది!
ఆడబడుచులు తియ్యారిస్తే తీపిగ చూస్తుంది
దాగుడుమూతా లాడినరోజులు మరిచేపోతుంది!
అత్తాచెప్పిన కొత్తాపనులు చేయూనంటుంది!
మామా కోరిన పిండీవంటలు వండానంటుంది!
వదినా వదినా వరాలవదినా పలకారిస్తావా?
కొత్తా మొగుడీ పేరేమంటే కోపాగిస్తావా?
వయారి వదినా బంగారమెంతో కావాలంటుందీ
వరాల వదినా సింగారమెంతో చేయాలంటుంది!
మితారి వదినా గారాబమంటే మిడిసీపడుతుంది!!




చెన్నపట్నం పాతమాంబళంలో సేతురామయ్య అనే అతడొకడున్నాడు. అతనికి ఎళుంబూరులో ఏడు, తొండియారుపేటలో తొమ్మిది, పరశువాకంలో పదీ, ముత్యాలపేటలో మూడూ, మొత్తం ఇరవై తొమ్మిది ఇళ్లున్నాయి.

అతను నెలనెలకీ వెళ్లి ధరాణా కూచుని నిక్కచ్చిగా బాడుగ వసూలు చేసుకురావటమేగాని ఆ యిళ్లల్లో వేటికీ కూడా మరామత్తు చేయించినపాపాన్ని పోయేవాడుకాదు. పైగా ఇళ్లగిరాకీ రావటంతో ప్రతీయింటికీ బాడుగ హెచ్చుచేసి వేశాడు. 'ఇవ్వలేము' అన్నవాళ్లని 'ఖాళీ చేసి పొండి' అన్నాడు. ఎవళ్ళయినా ఒకవేళ ఎదురుతిరిగినట్టయితే వాళ్ల వాటాలో ఎలక్ట్రీ తీగలు తెంపీ, కుళాయి గొట్టాలు లాగివేసీ ముప్పుతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించి వదిలేవాడు.

సేతురామయ్యకు చాలా ఇళ్లు ఉండటంచేత అద్దె వసూళ్లలో ఎక్కడ ఏయిల్లు మరిచిపోతానో అన్నభయంకొద్దీ అతడోపని చేశాడు. తన ఇరవైతొమ్మిది యిళ్లల్లోనూ కాపురాలున్నవాళ్ల జాబితా ఒకటి చిరునామాలతో సహా తయారుచేసి ఉంచుకున్నాడు. ప్రతి ఆసామీ పేరుకీ ఎదురుగా ఆసామీ ఇవ్వవలసిన అద్దెమొత్తంకూడా రాసి ఉంచి, ఆ ప్రకారం వాళ్ళవద్దనుంచి నెలనెలా కచ్చితంగా బాడుగలు వసూలు చేసుకునేవాడు.

ఇలాగే ఓమాటు ఇంటింటికీ వెళ్లి అద్దె వసూలు చేసుకుని, ఆ నోట్లన్నీ జాబితాతో సహా తన మనీపర్సులో భద్రపరుచుకుని సరిగా మిట్టమధ్యాహ్నం మిడసరిలగ్నం వేళ యెళుంబూరులో ఎలక్ట్రీ రైలెక్కి మాంబళం స్టేషన్‌లో దిగేడు. టిక్కెట్టు కోసం జేబులో చెయ్యి పెట్టేటప్పటికి చేతికి

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



టిక్కట్టు మాత్రమే తగిలింది కాని పర్సు కనబడలేదు!

సేతురామయ్యా కాళ్లు తేలిపోయి 'లబో లబో' మన్నాడు. అంతా చుట్టూ మూగారు. ఎవరేం చెయ్యగలరు? 'పాపం! సొమ్ము పోయిందిట' అంటూ ఒకమాటు సానుభూతి కనపరచి ఎవరి తోవన వారు పోయారు.

అతనంటే కిట్టనివాళ్లు మాత్రం 'అన్యాయంగా గుంజుకున్న డబ్బు నిలుస్తుందటయ్యా? అలా కావలిసిందే శాస్తి' అంటూ అతని మొహంమీదనే అనేసి అక్కసు తీర్చుకున్నారు.

ఎళుంబూరు స్టేషన్‌లో సేతురామయ్యా ఎక్కిన రైలుపెట్టెలోనే, పర్సు పోయే సమయానికి జేబుదొంగ కుట్టికన్ను ఉన్నాడు. కుట్టికన్ను తన జేబువైపు చెయ్యి పెడుతూవున్న సంగతి సేతురామయ్యాకి తెలియనే తెలియదు. ఎప్పుడు ఎలా కొట్టివేశాడో, సేతురామయ్యా జేబులోని పర్సుతో సహా కుట్టికన్ను, సేతుపేట స్టేషన్లో దిగిపోయి, మరి కనపడకుండా మాయమయ్యాడు.

కుట్టికన్ను అలా వెళ్లి వెళ్లి యెవరూ లేరనుకున్న ఒకచోట ఆగేడు. ఎకాయెకీని యింటికి పోతే తీరిపోను! కాని అత్రత కొద్దీ ఒక్కమారు అటూ ఇటూ చూసి, పర్సు తెరిచి రూపాయల నోట్లు లెక్కపెట్టడం మొదలెట్టేడు. అవన్నీ నూరేసి రూపాయల పెద్దనోట్లు కావటంచేత, అతని ఉత్సాహానికి మేరలేకపోయింది. ఆ సంతోషంలో కూనరాగాలు తీసుకొంటూ 'లాభం కలిగే...' అని ప్రారంభించి, "మూడు వందల ఎనభైమూడు!" అని లెక్కపెట్టి ముగించేటప్పటికి "ఎవరు? కుట్టికన్నేనా?" అనే మాటలు వినిపించాయి. వాడు ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూచే



టప్పటికి పోలీసు సబిన్స్పెక్టరు దొరరాజు ప్రత్యక్షమయాడు! ఇనస్పెక్టర్ని చూడటం తోనే వాడి ఆనందమంతా అణగారి పోయింది!

దొరరాజు ఆ పర్సూ, రూపాయల నోట్లూ చూచాడు. "ఏం కుట్టికన్నూ, ఓమాటు జైలుకు వెళ్లొచ్చికూడా దొంగతనం మాన లేదన్నమాట?" అన్నాడు. నోట్లతోబాటు ఇరవైతొమ్మండుగురి చిరునామాలూ ఉన్న సేతురామయ్య జాబితా కనపడింది. "ఆ జాబితా యేమిటి, కుట్టికన్నూ?" అని అడిగేడు దొరరాజు. ఆ జాబితా యేమిటో కుట్టికన్నుకు మాత్రం యేం తెలుసు? తలవని తలంపుగా కుట్టికన్నుకి ఒక రక్షణో పాయం తోచింది!

"ఇనస్పెక్టరుగారూ, ఈ జాబితాలో ఉన్నవాళ్లంతా నా స్నేహితులండీ. మీరే మనుకుంటున్నారోగాని, నేను ఇదివరకు మల్లేకాదు. జైల్లోంచి రావటంతోనే బుద్ధి తెచ్చుకుని తుంటరి స్నేహాలు వదిలేసి మంచి సహవాసాలు చేశాను" అన్నాడు.

"సరే కాని, ఈ పర్సూ, రూపాయలూ ఎక్కడివి?" అని అడిగాడు ఇన్స్పెక్టరు.

"ఎక్కడివేమిటి సార్, చెమటోడ్చి సంపాదించాను, సార్. ఇదివరకు ఎవళ్లెవళ్లవో పర్సులు కొట్టేసి పాపం సంపాదించాను కదండీ? ఆ పాత పాపమంతా పోగొట్టు కోవాలనిపించి 'ఏంచేస్తే బాగుంటుందీ?' అని ఆలోచించాను. నన్ను మంచిమార్గం లోకి తీసుకొచ్చిన యీ పెద్దమనుషు లందరికీ ఓమంచి రోజు చూసుకుని కాస్త కాస్త సొమ్ము మనియార్డరు చేసేద్దామని తోచి, సొమ్ము కూడబెట్టేను. ఈవేళ నా పుట్టిన రోజు. ఇంతకన్నా మంచి రోజేముం టుంది? ఎవళ్లెవళ్లకి ఎంతెంత మని యార్డరు కట్టదలుచుకున్నదీ ఈ జాబితాలో రాసిపెట్టుకుని, అనుకున్న ప్రకారం మని

యార్డర్లు చేసేద్దామని జాబితా, సొమ్మూ పట్టుకొచ్చాను" అన్నాడు కుట్టికన్ను.

ఇదంతా కుట్టికన్ను కల్పించిన కథ అని దొరరాజుకు తెలుసు. "సరే, పద. పోస్టాఫీసుకి!" అన్నాడు.

దాంతో కుట్టికన్ను తెల్లబోయాడు. కిక్కురుమనకుండా లేచి ఇనస్పెక్టరువెంట పోస్టాఫీసుకి వెళ్లి, ముక్కూమొగం ఎరగని ఆ ఇరవైతొమ్మండుగురికీ జాబితాప్రకారం సొమ్మంతా మనియార్డరు కట్టేశాడు! దాంతో సరిపోయిందా? పోస్టాఫీసులో గుమాస్తా మనియార్డరు ఫారాలలో సొమ్ము సరిచూసుకుని, "మనియార్డరు కమిష నేదీ?" అన్నాడు. కమిషను మాటే మరిచి పోయాడు కుట్టికన్ను. దానిమాట జ్ఞాపకం ఉంటే, కమిషన్ మినహాయించే సొమ్ము పంపివుండును! ఇప్పుడింక ఏమనుకుంటే ఏం లాభం? సొంత సొమ్ములోంచి నాలుగు రూపాయలపైచిల్లరతీసి చెల్లించుకున్నాడు.

సేతురామయ్యా ఇళ్లలో కాపురాలున్న ఆ ఇరవైతొమ్మండుగురికీ మనియార్డరు మర్నాడే అందేయి. ఆ కుట్టికన్ను ఎవరో, వాడు తమకు సరిగ్గా ఒక నెల అద్దెకు సరి పడిన సొమ్మే ఎందుకు మనియార్డరు చేశాడో ఎవరికీ బోధపడలేదు.

తరువాత సేతురామయ్యా వాళ్లందరితోటీ పర్సు పోయిన సంగతి చెప్పినప్పుడు వాళ్లలో కొందరు బుద్ధిమంతులు, సేతు రామయ్యామీద ఉండే కోపంకొద్దీ ఎవడో అతని పర్సు లాగేసివుంటాడనీ తనసొమ్ము మినహాయించుకొని, జాపితా పకా్రం సోదరభావంతో తక్కిన సొమ్ము తమకు మనియార్డర్లు చేసి ఉంటాడనీ, ఊహించు కుని వూరుకున్నారు.

కుట్టికన్ను పుట్టినరోజు ఇలా గడిచింది. చేజిక్కిన సొమ్ముకి లెక్కలొచ్చి యెగిరి పోవటమేగాకుండా పాపం, అతని స్వంత సొమ్ముకూడా చెయివదిలిపోయింది!






## 7

[ బారెడుగడ్డపు జానెడుమనిషియొక్క మాయలో ఉదయనుడూ, నిశీధుడూ, సంధ్యా కుమారుడూ ఎలా చిక్కుకున్నదీ, అతర్వాత దైవవశాత్తు మాయలవాడికిటుకు ఉదయనుడు ఎలా కనిపెట్టగలిగింది తెలుసుకొనే వున్నారుకదా! తరువాత ఏమి జరిగిందంటే—]

మామూలప్పుడే సహజసిద్ధంగా సంధ్యకూ, నిశీధుడికీ పగటివేళ కనుపించదుకదా? అందుకు తోడు ఇప్పుడు గెడ్డపువాడు వాళ్లని మాయంచేశాడాయె! ఆ మాయవల్ల ఉదయనుడు జానెడు మనిషిగా మారిపోవటమూ, మంచంపై పడుకొని ఉన్న గెడ్డంవాడు మామూలు మనిషి కావటమూ వాళ్లు తెలుసుకోలేకపోయారు. గెడ్డంవాడు ఏ క్షణాన లేస్తాడో, లేచి యింకేమి ప్రమాదం తెచ్చిపెడతాడో అని బేజారెత్తిపోతున్నారు. పైగా తమ సోదరుడేమయాడో అనే బెంగ!

గెడ్డంవాడి కిటుకు తనకు తెలిసిపోవటమే గాక, వాడిని మోసంచేసి తనుకూడా వానిలా మారిపోయాను కదా అని ఉదయనుడు సంతోషించాడు. ఈ సంతోషంలో ఉదయనుడు తన సోదరుల సంగతే మరిచిపోయాడు. ఇప్పుడు ఉదయనుడి దృష్టి అంతా తన జేబులలోవున్న భస్మాలపైనే వుంది. ఈ భస్మాలూ, అంజనాలూ ఎందుకు ఉపయోగపడతయ్యో అని ఆలోచిస్తూ వుండగా యాధాలాపంగా సోదరుల సంగతి గుర్తుకు వచ్చింది. చూచాడు. ఏరీ వాళ్లు? ఉదయనుడికి ఏమీ పాలుపోయిందికాదు. ఏమి చెయ్యటానికీ తోచక అలాగే పచార్లు చేస్తుండగా మెలకువవచ్చి గెడ్డపువాడు లేచాడు. ఎదుట అచ్చగా తన స్వరూపం



స్తాను. నేనుండగా మీరు శ్రమపడటమెందుకు?" అని అంటూ, ఉదయనుడి మెడలోవున్న దండకోసం అనేకవిధాల ప్రాధేయపడి అడిగాడు.

అంత తేలికగా టోపీపడేవాడా ఉదయనుడు! "ముందు నా సోదరులను ఎక్కడ దాచావో చెప్పు, తరవాత సంగతి ఆలోచిద్దాం" అన్నాడు.

"ఎక్కడా దాచలేదు. ఇక్కడే వున్నారు. అదుగో నీ చొక్కా ఎడమజేబులో వున్న డబ్బీలోని నల్లని భస్మం అక్కడ చల్లు" అంటూ వాళ్లని మాయం చేసిన చోటు చూపించాడు. అలాగే ఉదయనుడు నల్లి భస్మం చల్లేసరికి ఒక్కసారిగా నిశీధుడూ, సంధ్యా ప్రత్యక్షమయారు.

తర్వాత ఉదయనుడు "సరేకాని, నా చెయ్యి తిరిగివచ్చే మార్గం కూడా చెప్పు" అన్నాడు గెడ్డంవాడితో.

"దీనికి మందు నీదగ్గిరే వుంది. చూడు నీ కుడిజేబులో పచ్చని అంజనపు డబ్బీ వుంది. అది తీసి మొండిచేతికి రాయి" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు అలాగే చేసేసరికి తిరిగి మామూలుచెయ్యి వచ్చేసింది.

తోనే ఒక చెయ్యిలేని ఉదయనుడు కనిపించేసరికి గెడ్డపువాడికి అంతా అర్థం అయిపోయింది. తన బండారం బయటపడిందే అని లోలోపల మండిపోతున్నా పైకిమాత్రం కొంచెంకూడా కోపం కనబరచలేదు.

వాడు నెమ్మదిగా ఉదయనుడివైపుకి నడచివస్తూ, "మీరెవరో అసాధ్యులలాగా వున్నారే! ఇంతకాలానికి నా రహస్యం కనిపెట్టగలిగిన సమర్థులను చూడగలగటం నిజంగా నా అదృష్టమే అని భావిస్తున్నాను. ఐతే, దీనివల్ల మీకు కలగబోయే లాభం ఏమి లేదు. మీరు యిక్కడికి వచ్చిన పని ఏమిటో చెప్పితే నేను క్షణంలో నెరవేరు



ఇప్పుడు ఉదయనుడికి తన జేబులో వున్న తెల్ల భస్మమూ, ఎర్ర అంజనమూ ఎందుకు ఉపయోగపడతయ్యో తెలుసుకోవాలని తొందర కలిగింది. గెడ్డపువాడికి అవి చూపుతూ "ఇవి దేనికి?" అని అడిగాడు.

గెడ్డపువాడు నవ్వుతూ, "ఈమాత్రం గ్రహించలేవూ? నీ సోదరులని మాయం చేసింది ఈ తెల్లని భస్మంతోనే. నీ చెయ్యి మాయం చేసింది ఆ ఎర్రని అంజనంతో" అంటూ మర్మాలన్నీ బయటబెట్టాడు.

"మరైతే ఈ తువ్వాలు దేనికి?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

"దానివల్ల రెండు ఉపయోగాలు ఉన్నయ్. మీరు కోరుకొన్న ఆహారం ఏదైనా సరే మనసులో తలుచుకుని తువ్వాలు పరిచారంటే వెంటనే అది తయారవుతుంది. ఏవిధమైన వ్యాధినయినా యిది నయం చేస్తుందికూడా" అని చెప్పాడు గెడ్డపువాడు.

"అయితే మా కంటిచూపులలో భేదాలు మారిపోయేట్టు చేయగలదా ఈ తువ్వాలు?" అని మళ్లీ అడిగాడు ఉదయనుడు.

"చూపులేమిటి, భేదాలేమిటీ?" అని గెడ్డపువాడు ఆశ్చర్యంతో అడిగేసరికి, ఉదయనుడు తను చీకటిలో చూడలేకపోవటం, అలాగే తన సోదరులు వాళ్లకు అనుకూలం కాని వేళలలో చూడలేకపోవటం వివరంగా చెప్పాడు.

అంతా విన్నతరువాత గెడ్డపువాడు, "ఓహో ఇదా సంగతి? మీ ముగ్గురికి మామూలు చూపు వచ్చే మార్గం చెబుతా కాని ముందు నా దండ నాకు యివ్వు, మరి" అన్నాడు.

కాని ఉదయనుడికి తెలుసు, ఏమాత్రం ఏమరివున్నా గెడ్డపువాడు తమని ప్రాణాలతో వదలడని. అందువల్ల యుక్తిగా యిలా చెప్పాడు—"తాతా! మాకు చూపు వచ్చే




మార్గం చెప్పు. ఇది వక్కటే మాకు మిగిలి వున్న కోరిక, ఇక్కడికి పడమటి దిక్కుగా పది మైళ్ల దూరంలో ఒక గుహ వుంది. నీ దండ ఆ గుహలో వుంచి వెళిపోతాము. నీవు వచ్చి దానిని తీసుకుపోవచ్చు" అని చెప్పాడు.

ఆ దండ తనకు అయువుపట్టయి వుంది కనుక గెడ్డపువాడు ఈ యేర్పాటుకు వప్పుకొనక తప్పిందికాదు.

ఇంతలో నిశీధుడూ, సంధ్యా లేచి వచ్చి, "అన్నయ్యా! వీడి జీవానికి పడి మనం యింతవరకూ కడుపులు కాల్చుకునే వున్నాం. భలే ఆకలి వేస్తోంది. ఏదీ ఆ తువ్వాలు మహత్తు ఎంతవరకు నిజమో చూదాం!" అన్నాడు.

నిజానికి ఈమాట ఉదయనుడికి తోచనే లేదు. ఎప్పుడైతే సోదరులు ఈ మాట అన్నారో ఉదయనుడు రకరకాల ఫలాల పేర్లూ తలుచుకుని తువ్వాలు పరిచాడు. మరుక్షణాన తువ్వాలు నిండా నవనవలాడుతూ రకరకాల పళ్లూ నిండి కనుపండువుచేసినై. ఉదయనుడు కొన్నిఫలాలు తన సోదరులకిచ్చి, తాను కొన్ని తీసుకున్నాడు. కాని ఎన్ని తీసినా తువ్వాలుమీది పళ్లు తరగనేలేదు. అందుచేత, దుష్టుడైనప్పటికీ గెడ్డపువాడికికూడా కొన్నిపళ్లు పెట్టాడు.

కడుపునిండాక ఉదయనుడు తువ్వాలు మడిచి జేబులో వుంచుకుని "మరి ఇక మా చూపులు సరి అయ్యే మార్గం చెప్పు. చూపులు వస్తే మాదారిన మేము పోతాం" అన్నాడు.

అందుకు గెడ్డపువాడు "నీ దగ్గిరవున్న ఎర్ర అంజనం వుండచెయ్యి. ఆ వుండని ఈ నారపీచులో చుట్టి ముట్టించు. దానిలోంచి బ్రహ్మాండమైన పొగ వస్తుంది. మీరు ముగ్గురూ ఈ తువ్వాలు తలపైన కప్పుకొని

ఆ పొగ మీ కళ్లకి తగిలేట్టు చూడాలి. ఒక్క అయిదు నిమిషాలు అలా వున్నట్లైతే మీకు మామూలు చూపు వచ్చేస్తుంది" అని చెప్పాడు.

అలాగే ఉదయనుడు ఎర్ర అంజనం వుండచేసి ఆ వుండని నారపీచులో కట్టాడు. కాని నిప్పు ఎక్కడినుంచి తేవటం?

ఉదయనుడు ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తుండగా గెడ్డపువాడు రెండు చెకుముకి రాళ్లు తెచ్చి నిప్పుచేసి అంటించాడు. నారపీచులోవున్న ఆ వుండ అంటుకోగానే బ్రహ్మాండమైన పొగ లేచింది. ఉదయనుడు తన సోదరులనుకూడా తీసుకుని, ముగ్గురూ ఆ పొగలో కూచుని తలల పైన తువ్వాలు కప్పుకున్నారు.

అయిదు నిమిషాల తరవాత ముగ్గురూ బయటికి వచ్చారు. ఒక్కొక్కళ్ల కళ్ల వెంబడి నీరు కాలువలా ప్రవహించి, కొంత సేపటికల్లా కంటితడి అరిపోయింది.

కాని, ఆశ్చర్యమేమిటంటే, తమకు మామూలు చూపు వస్తుందని యింతా చేస్తే గెడ్డపువాడు చెప్పినట్టు చెయ్యటంవల్ల చూపు రాకపోవటమే కాక, యిప్పుడు కనుగ్రుడ్లే మాయమైపోయినై.





కూడా రాచాడు. వాళ్లకి వచ్చేసినై. తాను గెడ్డంవాడిపైన అనవసరంగా కోపపడ్డందుకు ఉదయనుడు సిగ్గుపడ్డాడు. రాత్రి వేళల తప్ప చూపు కనిపించని నిశీధుడూ, సంధ్య వేళ తప్ప చూపు కనిపించని సంధ్యాకూడా యిప్పుడు చక్కగా చూడగలుగుతున్నారు. ఇందుకు వాళ్లు ఎంతో ఉప్పొంగిపోయారు.

అతర్వాత వాళ్లు తమ గుళ్లాల్ని తెచ్చుకుందామని చెప్పి బయలుదేరారు. మొదట ముగ్గురూ అడవిలోకి వచ్చి అంతకుముందు గుళ్లాల్ని కట్టేసిన చెట్టుదగ్గరికి చేరుకున్నారు. ఉదయనుడు తనదగ్గిరవున్న నల్ల భస్మం అక్కడ చల్లేసరికి యథాప్రకారం గుళ్లాలు రెండూ ప్రత్యక్షమైనై. వాటిని తీసుకుని వాళ్లు గుహలో దాచిన నల్లగుళ్లంకోసం వెళ్లి, దాన్నికూడా తీసుకుని గెడ్డంవాడి ఇంటికి తిరిగివచ్చారు.

అప్పుడు గెడ్డంవాడు—"మీ కోరికలన్నీ నెరవేరినట్టేకదా? ఇక మీదారిన మీరు వెళ్లండి. వాగ్దానం ప్రకారం నా దండమాత్రం ఆ గుహలో వదిలి వెళ్లండి మాట తప్పితేమాత్రం..." అని యింకా ఏమో చెప్పబోతుండగా నిశీధుడు అడ్డుతగిలి, "సరేకాని, అసలింతకూ, నీవెవరవు?

ఉదయనుడు ఉగ్రుడైనాడు. "ఏమిరా దుర్మార్గుడా! ఇదేనా నీవు మాకు చూపులు తెప్పించటం?" అంటూ ఉరమసాగాడు.

అందుకు గెడ్డపువాడు "తొందరపడకు బాబూ! మిమ్మల్ని మోసమే చెయ్యాలనుకుంటే ఈ రహస్యాలన్నీ చెప్పేవాడినా? అసలు పని ముగియుండే అలా కేకలు వేస్తావెందుకు? ఇప్పుడు కనుగ్రుడ్లుకూడా లేవు కదా? నీ దగ్గిరవున్న ఆ పచ్చ అంజనం రెప్పలపైన రాచుకొని చూడు" అన్నాడు.

అలాగే ఉదయనుడు ఆ అంజనం కంటి రెప్పలపైన రాచుకునేసరికి మామూలుగా కళ్లు వచ్చేసినై. వెంటనే సోదరుల కళ్లకి

చారినపోయే అమాయకులను ఎందుకిలా నిర్బంధిస్తున్నావు?" అని అడిగాడు.

అందుకు గెడ్డపువాడు, "ఆ సంగతి నేను చెప్పకూడదు. అది గొప్ప రహస్యం. అది వెల్లడించినట్టయితే నేను తలపగిలి చస్తాను. కనుక క్షమించండి" అన్నాడు.

సోదరులు ముగ్గురూ ఒక్క మాటగా వానిపైన సానుభూతి కనబరిచి, ఈరహస్యం గురించి అడగకుండా వదిలేశారు. తర్వాత వాళ్లు తమతమ గుఱ్ఱాలమీద బయలుదేరి పోసాగారు. పోతూ పోతూ ఉదయనుడు గెడ్డపువాడితో, "మరొక్క కోరిక వున్నది. నీ దండ అయితే నీకు యిస్తాము కాని ఈ అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ మాకు యివ్వాలి సుమా" అన్నాడు.

ఇందుకుకూడా గెడ్డపువాడు ఒప్పుకోక తప్పిందికాదు. తర్వాత తెల్లగుఱ్ఱంమీద ఉదయనుడూ, నల్లగుఱ్ఱంమీద నిశీధుడూ, ఎఱ్ఱగుఱ్ఱంమీద సంధ్యా బయలుదేరారు.

వాళ్లు అలా పోయి పోయి చివరకు గెడ్డపువాడికి గుర్తు చెప్పిన గుహ చేరుకున్నారు. మాట యిచ్చినప్రకారం ఉదయనుడు తనమెడలో దండతీసి ఆ గుహలో పెట్టాడు. ఎప్పుడైతే దండ మెళ్లోనించి తీసి




వేశాడో, అప్పుడు ఉదయనుడికి మామూలు రూపం వచ్చేసింది. ఆతర్వాత వాళ్లు తిరిగి తమ గుఱ్ఱాలమీద సాగిపోయారు.

కొంతదూరం పోగా వాళ్లు ఒక కీకారణ్యంలో ప్రవేశించారు. అప్పటికే చీకటి పడుతూవుంది. రాత్రిపూట ఆ అరణ్యంలో ఎక్కడ తల దాచుకోవటం? ఏమి చెయ్యటమా అని వాళ్లు ఆలోచిస్తూ వుండగా మూడు సింహాలు తమవైపు గర్జించుకుంటు రాసాగినై. నిశీధుడికీ, సంధ్యకూ ఏమీ తోచిందికాదుగాని యుక్తిపరుడైన ఉదయనుడు తన దగ్గరవున్న తెల్ల భస్మం తీసి నిశీధుడిమీదా, సంధ్యమీదా వాళ్ల గుఱ్ఱాల

మీదా చల్లాడు. వెంటనే వాళ్లు మాయమయారు. తన గుఱ్ఱంపైనా తనపైనాకూడా చల్లుకున్నాడు. తనూ మాయమయాడు!

వాళ్లు మాయం కావటమూ, ఆ మూడు సింహాలు ఉరుకులెత్తుతూ అక్కడికి చేరటమూ ఒక్కమాటే జరిగింది. విందు భోజనం దొరికిందికదా అని ఎంతో ఆశతో వచ్చిన ఆ సింహాలకి పాపం నిరాశ అయిపోయింది. కొంతసేపు అక్కడే తచ్చాడి, వాటిదారిన అవి పోయినై.

కాని సింహాలు వెళ్లిపోయినా మామూలు రూపంతో రాత్రివేళ ఆ మహారణ్యంలో సంచరించటం ప్రమాదకరమని తలచి, తెల్లారేవరకూ అదృశ్యరూపంతోనే వుండి పోయారు అన్నాదమ్ములు.

తెల్లవారింది. ఉదయనుడు తనవద్దవున్న నల్లభస్మం తనపైనా తన గుఱ్ఱంపైనా సోదరులపైనా వాళ్ల గుఱ్ఱాలపైనా చల్లేసరికి మళ్లీ మామూలు రూపాలు వచ్చేసినై.

ఇప్పుడు వాళ్లు ముగ్గురూ గుఱ్ఱాలపైన వాయువేగాన స్వారి చేయగల్గుతున్నారు. గెడ్డంవాడి దయవల్ల అందరికీ సరియైన చూపు వచ్చింది కనుక ఎవరు ముందూ, ఎవరు వెనకా అన్న బాధ లేదు. కొంత దూరాన వారికి ఒక నిర్మానుష్యమైన ప్రదేశంలో ఒక భవనం కనుపించింది.

"ఆ భవనం ఎవరు ముందు చేరుకోగలమో చూద్దాం" అంటూ ముగ్గురూ తమ తమ గుఱ్ఱాల్ని జోరుగా అదలించారు. ఉదయనుడి గుఱ్ఱం శరవేగంతో పోతున్నది. అతనికి కొంచెం వెనుకలో సంధ్య, నిశీధుడు సమానవేగంతో వస్తున్నారు. కాని చిత్రం!— ముందు పోతున్న ఉదయనుడు రెప్పపాటులో మాయమయ్యాడు.

---

[ఉదయనుడు ఏమైనట్లు? ఆ భవనానికీ అతను మాయం కావటానికి ఏమైనా సంబంధ మున్నదా? ఇంతకూ మళ్లీ సోదరులు ముగ్గురూ కలుస్తారా, లేదా?—వచ్చేనెల చందమామలో]






పూర్వం అనగా సుమారు రెండు వందల సంవత్సరాల కిందట, సింహాచలం దేవాలయంలో ఒక చిత్రం జరిగింది. అదియేమిటీ అంటే—

సింహాద్రి నారసింహస్వామికి కృష్ణమాచార్యులు అనే ఆంతరంగిక భక్తుడు ఒకాయన ఉండేవాడు. ఆ వైష్ణవోత్తముడు భక్తిపూర్వకంగా మధురగానం చేసేసరికి స్వామి మెచ్చుకుని అతని ఎదట ప్రత్యక్షమై ఆచార్యులు పాడే పాటకు అనుగుణంగా నృత్యం చేసేవాడు. ఇలా జరుగుతూవుంటే ఆచారిలో ఒకవిధమైన గర్వం బయల్దేరింది. 'సింహాద్రినాధుడికి నేనే ప్రియమైన భక్తుణ్ణి. స్వామికి నేను ఎంత చెబితే అంత'. అని మనసులో అనుకొనేవాడు.

ఇదే సమయంలో విశిష్టాద్వైతమతాన్ని ఉద్ధరించినటువంటి శ్రీ రామానుజస్వామి వాు దిగ్విజయ యాత్ర చేసుకుంటూ ఈ దేవాలయానికి విజయం చేశారు. మహానుభావుడైన రామానుజస్వామిని అవతార పురుషునిగా ఎంచి అందరూ అనేకవిధాల గౌరవిస్తూవుండగా కృష్ణమాచార్యులు మాత్రం నమస్కారమైనా చేయక నాఅంతటివాడను నేను అనే అహంభావంతో అయనవైపే చూడటం మానివేశాడు.

సర్వజ్ఞుడైన రామానుజాచార్యులవారు ఈపాటి గ్రహించలేరా ?—అతని మనసుకి పట్టిన గర్వాన్ని ఇట్టే తెలుసుకున్నారు. ఆయనే స్వయంగా కృష్ణమాచారిని పలకరించి, వినయపూర్వకంగా "స్వామీ!— కృష్ణమాచార్యోత్తమా! మీరు నాకొక్క ఉపకారం చేసి, తరణోపాయం చెప్పాలి; ఈ రాత్రి సింహాద్రినాధుని సన్నిధానమందు దేవరవారు గానమొనర్చి, ఆ దేవదేవుని ప్రసన్నునిగా చేసికొన్నతరువాత 'దాసు'నకి ముక్తి వున్నదా లేదా ?' అని అడగండి.

ముద్దా సోమప్రశాస్త్రి, పరశువాకం



వారువీమి సెలవిస్తారో వినండి. తరువాత 'మీకు మోక్షం ఉన్నదా లేదా' అనికూడా ప్రశ్నించండి. స్వామి చెప్పే ప్రత్యుత్తరం జాగర్తగా తెలుసుకుని రేపు ఉదయాన ఈ దాసునికి తెల్పండి" అన్నారు.

ఈ మాటకు కృష్ణమాచారి చాలా సంతోషించాడు. ఏమీ అంటే—అవతార మూర్తి అని ఎవరికైతే లోకమంతా జోహారు చేస్తున్నదో, ఆ రామానుజుడే తనను ఈ విధంగా ఆశ్రయించటంకంటె కావలిసిన దేముంటుంది !—

అందుచేత ఆ రాత్రే తన దివ్యగానం చేత స్వామిని మెప్పించి, ప్రత్యక్షం చేసుకుని "దేవాదిదేవా !—దక్షిణదేశాన్నుంచి రామానుజాచార్యుడనే యతీశ్వరుడు ఒకాయన వచ్చి ఉన్నాడు. ఆయనకు ముక్తి ఉన్నదా లేదా ? ఈవిషయం దేవరను అడిగి జవాబు చెప్పమన్నాడు. ఏమిటి అజ్ఞ ?" అని అడిగాడు.

అప్పుడు సింహాద్రినాథుడు "ఓయీ భక్తవరేణ్యా ! ఆ రామానుజుడు కేవలమూ మునీంద్రుడాయెనే. ఆయన ఇచ్చినవారికే ముక్తి కలుగుతూవుండగా ఆయనకు ముక్తి వున్నదా లేదా అనేది ఒక ప్రశ్నా? అదీ సందేహమేనా ?" అని బదులు చెప్పాడు.

"ఐతే స్వామీ! నాకు మోక్షం కలదా?" అంటూ మళ్లీ ప్రశ్న వేశాడు కృష్ణమాచారి. అందుకు స్వామి "ఓయి కృష్ణమాచార్యా ! నీవు నాకు ప్రియమైన భక్తుడవే. నిజమే. కాని, నీకు మోక్షమివ్వటానికిమాత్రం నాకు అధికారం లేదు. ఏమంటే—'విభూతిద్వయాధికారం' ఇదివరకే రామానుజాచార్యునికి ఇచ్చివేశాను. ఎవరికి మోక్షమివ్వటానికైనా అయనే సర్వాధికారి. కనుక, నీకు మోక్షం కావలెనంటే నీవు వెళ్లి అయననే ఆశ్రయించాల్సి వుంటుంది" అని చెప్పారు.

భగవంతుని వాక్యాలు వినగానే అంతులేని అహంకారం చెలరేగి, కృష్ణమాచార్యుడు ఉగ్రుడయ్యాడు. "ఇంతకాలమై నిన్ను ఆశ్రయించిన ఫలమిదేనా? పరమపదంకోసం పరులను ప్రార్థించమంటావా? అమితమైన భక్తి తాత్పర్యాలతో ఇన్నేళ్లుగా నిన్ను కీర్తించి భజించానే! చివరకు నన్ను ఇలా మోసగిస్తావా?" అని నోటికి వచ్చినట్టల్లా నిష్ఠురంగా మాటాడజొచ్చాడు.

ఈ నిష్ఠురాలకు సహించలేకపోయాడు సింహాద్రి నాథుడు. "కృష్ణమాచార్యా!— నీవు రాజసుడివి, తామసుడివి. భక్తితో పాడానని ఏదో మహా ఉపకారంగా చెబుతున్నావే? నీవు పాడావు, నేను ఆడాను. నీ పాటకూ నా ఆటకూ సరిపోయింది. మరేమీ బాకీ మిగులలేదు. ఇప్పుడు అనాలోచితంగా ఉద్రేకం తెచ్చుకుని నీవు నాపట్ల కఠినంగా మాట్లాడావు కాబట్టి నీవు రచించిన కీర్తనలన్నీ నీచులపాలై పోవుగాక!" అంటూ శపించివేశాడు.

దేముడిలా శపించేసరికి ఆయన భక్తుడైన కృష్ణమాచార్యునికికూడా తీవ్రమైన కోపం వచ్చేసింది. "ఓయి అప్పన్నా!—



సమస్తమూ నీవే అని నమ్ముకునివున్న నన్ను మోసగించావు. నా జీవితమంతా నాశనం చేశావు. ఇదిగో నేనే నిజమైనభక్తుణ్ణయితే నీ ఆలయమంతా ఒక్కరీతిగా ఏడురోజులు మండి, గోపురాలూ, మంటపాదులూ అన్నీ కళా కాంతీ లేక పాడుపడిపోవుగాక!" అంటూ సింహాద్రినాథునికి ప్రతిశాపం ఇచ్చాడు.

సింహాద్రినాధుని శాపంవల్ల కృష్ణమాచార్యుని కీర్తనలన్నీ నీచులపాలైనాయి. కృష్ణమాచార్యుని శాపప్రయోగంవల్ల మరి కొద్ది కాలానికే 'మలికినేబ్' అనే మ్లేచ్ఛ నాయకుడు బ్రహ్మాండమైన తన దండుతో

సహా వచ్చి సింహాచల క్షేత్రాన్ని ధ్వంసం చేయ బూనాడు. క్రూరుడైన ఆ యవనులు ఆలయాన్ని ముట్టడించి ఆక్రమించబోతా రనే వర్తమానం మహాభక్తుడు, మహాకవి ఐనటువంటి గోగులపాటి కూర్మనాధునికి ముందుగానే తెలిసింది.

ఎవరికీ తెలియకుండా ఆయన తక్షణమే దేవాలయ అంతర్భాగంలోకిపోయి కూర్చుని మహాభక్తి తాత్పర్యాలతో సింహాద్రి దేవుణ్ణి ప్రార్థించాడు. ఆ ప్రార్థనకు ఫలితంగా అతనికి కవితాప్రభావం కలిగి 'వైరిహరరంహా! సింహాద్రినారసింహా!!' అనే మకుటంతో సీసపద్యాలు చెప్పనారంభించాడు. ఈ పద్యాలలో కూర్మనాథకవి, ఆ యవనులొనర్చే ఘోరాలను శాంతింపజేయుమనీ శత్రుక్షయము చేయుమనీ కోరాడు. సింహాద్రిదేవుని దుర్బలత్వాన్ని హెచ్చరిస్తూ అరవై పద్యాలవరకూ ముందు నిష్ఠురంగా వర్ణించాడు.

కూర్మనాధుడు అరవై ఎనిమిదో పద్యం చెప్పినవెంటనే కవిచంద్రుని భక్తికి సంతసించి, స్వామి గండుతుమ్మెదలను సృష్టించాడు. ఆ తుమ్మెదలు యవనుల సేనను మర్దిస్తూ, వాడి ఐన తొండాలతో పొడుస్తూ, చీల్చి చెండాడుతూ సుమారు పదిమైళ్ల దూరంవరకూ శత్రుదండును పారదోలినై.

ఈ ధాకకు తట్టుకోలేక యవనుల దండు వాల్తేరుకు అరమైలు దూరానవుండే ఒక మెట్టవరకు పారిపోయింది. నాటినించీ ఆ మెట్టకు 'తుమ్మెదల మెట్ట' అనే పేరు వచ్చింది. తుమ్మెదల మెట్ట ఇప్పటికీ వున్నది. విశాఖపట్టణానికి అది శ్మశానవాటికగా ఉపయోగపడుతున్నది. ఈవిధంగా కూర్మనాథకవి సూక్తులవల్లనే సింహాచల క్షేత్రానికి క్షేమంకలిగింది. తరువాత కూర్మనాథకవి తన నరసింహశతకంలోనే స్వామి మహిమను కొనియాడుతూ కొన్ని క్షమాపణ పద్యాలు చక్కగా వర్ణించి చెప్పాడు.





# పతివ్రతల సభ

పూర్వం ఒకప్పుడు పతివ్రతలందరూ ఒక చోట చేరి పెద్ద సభ చేశారు. చేశారే కాని, ఆ సభ సాంతమయిందికాదు. ఏమంటే ఏ సభకైనా ఒక అధ్యక్షుడో, అధ్యక్షురాలో ఉండాలికదా? 'మన సభకి ఎవరిని అధ్యక్షురాలుగా ఎన్నుకుంటే బాగుంటుందీ?' అన్న సమస్యే వారిలో వారికి తెమిలిందికాదు. వాళ్లల్లో ఎన్నో పార్టీలు ఉండటంచేత వాదోపవాదాలు చెలరేగి, నాలుగైదు ఘంటలు చర్చ జరిగాక ఒక నిశ్చయానికి రాలేక సభ చాలించేసి ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

వెళ్లి ఊరుకున్నారా? సరస్వతీదేవి వెళ్లి భర్త ఐన బ్రహ్మదేవుడితో 'చూశారా, ఏం చేశారో వాళ్లంతా? నేను మహాపతివ్రతను కానా? పతివ్రతను కనుకనే కదండీ నన్ను మీరెప్పుడూ నాలికమీద ఉంచుకుంటున్నారు?' అంది.

సరస్వతిలాగే లక్ష్మీదేవి విష్ణుమూర్తితో ఫిర్యాదు చేసి, 'ఈ లోకంలో నాకంటె పతివ్రత ఎవరు? నన్ను మెచ్చుకునేకదా నాకు మీ వక్షస్థలంమీద చోటిచ్చారు?' అంది.

పార్వతి వెళ్లి భర్తతో 'మీరు నాకు అర్ధశరీరమే ఇచ్చేశారు! మహాపతివ్రతననే కదా?' అని అడిగింది. సీత, సావిత్రి, అరుంధతి, అనసూయ, సుమతి మొదలైన వారంతాగూడా తమతమ భర్తలతో తమ గొప్పతనాన్ని చెప్పుకుని, అగ్రాసనాధిపత్యం తమకు రాలేదని చిన్నబుచ్చుకున్నారు.

ఇంతలో నారదుడు ఎక్కడినుంచో వచ్చి, ఒక్కొక్క పతివ్రత ఇంటికే పనిగట్టుకువెళ్లి, 'ఏవమ్మోయ్, నీకంటె మహాపతివ్రత ఒకామె భూలోకంలో ఉంది సుమా!' అని చెప్పనారంభించాడు.

'యమధర్మరాజు చేతిలోంచి భర్తను బ్రతికించుకొచ్చాను నేను. నాకంటె

సి. అమృతవల్లి, ధర్మవరం



గొప్పదా ఆమె?' అంది సావిత్రి. 'మానం కాపాడుకొనటానికి త్రిమూర్తులనుకూడా పసిబిడ్డలుగా చేసి పాలిచ్చాను. నాకంటే గొప్పదటయ్యా, నువ్వు చెప్పినావిడ?' అన్నది అనసూయ. 'భర్త ప్రాణాలు కాపాడటానికి సూర్యుడు ఉదయించకుండా చేశాను. నాకంటే గొప్పదంటావా ఆవిడెవరో?' అని అడిగింది సుమతి. ఇలాగే తక్కినవాళ్లుకూడా అడిగేసరికి నారదుడు 'గొప్పదేనమ్మా. మీ అందరికంటె గొప్పదే' అని నిర్మొగమాటంగా చెప్పివేశాడు.

ఆమె ఎవరో, ఆవిడ గొప్పతనమేమిటో చూడాలనిపించింది వాళ్లందరికీ. 'మీరంతా కట్టుగట్టుకుని వెళ్లేరంటే ఆమె హడిలి పోతుంది. మీలో ఎవరో ఒకరు వెళ్లి చూసి రండి' అన్నాడు నారదుడు. నారదుని వద్ద ఆ పతివ్రత చిరునామా పుచ్చుకుని ముందుగా పార్వతీదేవి బయల్దేరింది.

నారదుడు చెప్పిన నెంబరుగల ఇల్లు ఒక పూరిగుడిసె. పైగా తలుపు బిగించి ఉంది. పార్వతీదేవి గుమ్మంవద్ద నిలబడి, 'ఎవరమ్మా లోపల? నేను ఫలానా పార్వతీదేవిని. కాస్త తలుపు తియ్యి' అంది.

లోపలున్నామె తలుపు తియ్యకుండానే "అమ్మా, మీరు వస్తారని కాస్త ముందుగా తెలిసి ఉంటే 'తలుపు తియ్యవచ్చా?' అని నా భర్తగారిని అడిగి ఉందును. ఆయన ఎక్కడికో వెళ్లేరు. ఈ రాత్రి ఆయన వచ్చాక అడిగి ఆయన అనుజ్ఞ ఐతే రేపు తలుపు తీస్తాను. కాబట్టి మీరు రేపోసారి మళ్లీ దయచెయ్యండి" అంది. పార్వతి ఆశ్చర్యపడి, మాట్లాడకుండా కైలాసానికి తిరిగి వెళ్లిపోయింది.

గుడిసెలోవున్న ఆ మహాపతివ్రత పేరు గవిరి. అది ఆ గ్రామంలో పచ్చగడ్డి కోసి అమ్ముకునే గంగులు అనే పేదవాని భార్య. గంగులు పచ్చగడ్డి మోపు అమ్మేసి ఆ

సాయంకాలం ఇంటికొచ్చాక గవిరి భర్తతో పార్వతీదేవి వచ్చినట్టు చెప్పి 'తలుపు తియ్యమంటారా?' అంది. 'తప్పకుండా తియ్యి' అన్నాడు గంగులు.

ఆ మర్నాడు పార్వతీదేవి మళ్లీ ఆ గుడిసెవద్దకు వచ్చింది. తల్లి ఎక్కడికో వెడుతోందని కనిపెట్టేసిన విఘ్నేశ్వరుడు, 'నన్నుకూడా తీసుకువెళ్లమ్మా' అని ఆవిడ వెంటపడ్డాడు. గవిరి పార్వతీదేవికి తలుపు తియ్యబోతోంటే విఘ్నేశ్వరుడిమాట విని పించి, 'ఎవరమ్మా, నీకూడా వస్త?' అని అడిగింది. 'మా అబ్బాయేనమ్మా గణపతి' అంది పార్వతి. కాని గవిరి తలుపు తియ్య లేదు! 'అమ్మా, మీ ఒక్కరికీ తలుపు తియ్యటానికే నా భర్త అనుజ్ఞ అయింది. నీ కుమారుడుకూడా వస్తాడన్న సంగతి నాకు తెలిసిందికాదు. ఈ రాత్రి మళ్లీ మా ఆయన్ని అడిగి మీ అబ్బాయికికూడా తలుపు తియ్యటానికి అనుజ్ఞ పుచ్చుకుంటాను. కనుక మీ రిద్దరూ రేపు దయ చెయ్యండి' అని పంపేసింది.

'దేవుడా' అంటూ పార్వతి కైలాసానికి తిరిగిపోయి మర్నాడు మళ్లీ వచ్చింది. ఈమాటు కుమారస్వామి 'నేనూ వస్తాన'



న్నాడుకాని వాడొచ్చాడన్న కారణంవల్ల గవిరి తనకు తలుపు తియ్యదేమో అని భయమేసి, పార్వతి తన రెండో కుమారుణ్ణి తీసుకురాకుండానే వచ్చింది. గవిరి ఈ మాటు పార్వతి రావటంతోనే తలుపు తీసి 'దయ చెయ్యండమ్మా' అని గౌరవించింది. పార్వతి ఆ గుడిసె అంతా పరికించి, గవిరి కున్న శుచి శుభ్రతలకు మెచ్చుకుంది. వాళ్లకి ఆట్టే సామానే లేదు. ఒక ముక్కాలి పీట, పరిచిఉన్న బొంత. ఒక నులక మంచం, తరవాణికుండ, మండుతోన్న పొయ్యి, ప్రక్కన పెనం, అట్లపిండీ ఉన్నై. ఇంకా పెండెనుంచి వ్రేలాడుతున్న

ఒక చేంతాడూ, చిలకకొయ్యకు తగిలించి ఉన్న ఒక బెత్తంకూడా కంటబడ్డాయి.

పార్వతీదేవి మాట కలిపించుకోడానికి ఒక్కొక్క వస్తువే చూపి, 'ఇదెందుకు?' 'ఇదెందుకూ?' అంటూ అడిగింది గవరమ్మని. అందుకు ఆమె, 'నా భర్త అలసి వస్తే కూచోటానికి ఈ ముక్కాలి పీట. కాస్త నడుం వాల్చాలని బుద్ధి పుట్టిందంటే బొంత ఉన్న ఆ మంచంమీద పడుకుంటారు. 'ఆకలి వేస్తోంది. అన్నం' అన్నట్టయితే తరవాణికుండలో అన్నం సిద్ధంగానే ఉంది. 'అన్నం వద్దు. వెచ్చ వెచ్చగా అట్లువేసియ్యి' అంటే, అప్పటి కప్పుడు మొదలెట్టకుండా, పిండీ, మండు తోన్న పొయ్యి అన్నీ సిద్ధంగా ఉంచాను' అని బదులు చెప్పింది.

ఆ పేదరాలు భర్తకోసం చేసిన యేర్పాట్లన్నీ చూసి పార్వతీదేవి మెచ్చుకుంది. కాని ఆవిడకు ఆ త్రాడూ, బెత్తం ఎందుకో మాత్రం తెలిసిందికాదు. వాటిని గురించి అడిగేసరికి గవిరి, "అమ్మా నా తెలివి తక్కువవల్ల ఎందుకైనా నామీద నా భర్తకి కోపం వచ్చిందనుకోండి. అప్పు డాయన నన్ను ఆ రాటకు కట్టేసి, బెత్తం పుచ్చుకుని కొట్టవలసి ఉంటుంది. పొద్దస్తమానం అలసివచ్చి అప్పటికప్పుడు తాడూ, బెత్తం కోసం వెతుక్కోగలరా? అందుకనే సిద్ధం చేసి ఉంచాను!" అంది.

ఆ మాటలు వినటంతో పార్వతీదేవి ఆశ్చర్యానికి మితిలేకపోయింది. 'మహా పతివ్రతలం' అని పేరుపడ్డ మనమంతా మొగుడు కోపం వచ్చి కొడితే ఎదురు చెప్పక పడి ఊరుకున్నామేగాని, ఈమెకు మల్లే తాడూ, బెత్తం సిద్ధంచేసి ఉంచలేదు. నారదుడు చెప్పినమాట నిజమే. ఈ గవిరమ్మ మనందరికన్నాకూడా మహా పతివ్రత" అని మెచ్చుకుంటూ వెళ్లి ఈ గాథ తక్కినవాళ్లందరికీ చెప్పింది.





# పండితరాయలు



గోదావరీ మండలంలో పండితభట్టు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు వరసన ఏడుగురు కొడుకులు పుట్టేరు. కాని ఒక్కడూకూడా బ్రతకలేదు. ఎనిమిదో మాటు అయన భార్యకు నెలలు నిండుతున్నవనగా ఆమె పుట్టెడు దిగులుతో 'ఈ పుట్టబోయే శిశువుమాత్రం బ్రతుకుతుందా? ఇలాంటి దారుణమైన గర్భశోకం రావటానికి నేను యేమి పాపం చేశానోకదా ?' అంటూ దుఃఖింపసాగింది.

ఇంతలో అదారిని పోతూన్న పకీరొకడు అక్కడ అగి 'అల్లాహెూ అగ్బర్!' అన్నాడు.

ఆ మాట వినటంతోనే పండితభట్టు భార్య 'మీ అల్లా నిజంగా గొప్పవాడే ఐతే నాకు ఈ శోకం లేకుండా చెయ్యమనండి, చూతాం!' అన్నది పకీరుతో.

'తప్పకుండా చేస్తాడు. నీకు పుట్టబోయే కొడుక్కి అయువు, ఆరోగ్యం, పాండిత్యం, ఐశ్వర్యం అన్నీ అబ్బేటట్లు చెయ్యమని మా అల్లాను ప్రార్థిస్తాను' అని చెప్పి ఆ పకీరు వెంటనే మసీదుకు వెళ్లి అలాగనే ప్రార్థన చేశాడు.

ఆ పకీరు ఎంత గొప్ప భక్తుడోగాని, సరిగా అతని ప్రార్థనప్రకారమే జరిగింది. తొమ్మిది నెలలూ నిండిన తరువాత పండితభట్టు భార్య బాలభానుడులాంటి పిల్లవాణ్ణి కన్నది. అతనికి తలిదండ్రులు జగన్నాధుడు అని నామకరణం చేసి, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు. అతడు దినదినప్రవర్ధమానుడై పెరిగి, పెద్దవాడై సమస్తమైన విద్యలూ, వేదశాస్త్రాలే గాక విలువిద్య కూడా నేర్చి గొప్ప వీరుడనిపించుకున్నాడు.

ఆ కాలంలో ఢిల్లీ సింహాసనంమీద కూర్చుని పరిపాలిస్తూవున్న పాదుషాగారికి కూడా పండితభట్టుకి పట్టిన అవస్థే పట్టుకున్నది. వరసగా ఆయన సుల్తానా

జి. మందకరామయ్య, సామర్లకోట



ఏడుగురు కుమార్తెలను కనటం, వాళ్లలో ఒక్కర్తెకూడా బ్రతికి బట్టకట్టకపోవటం జరిగింది. అమెకు ఎనిమిదోసారికూడా కాన్పు రావటం, పండితభట్టు భార్యకు మల్లే అమెకూడా దుఃఖించటం సంభవించింది. అమె యేడుపు వినిన సన్యాసి ఒకడు వచ్చి, 'తల్లీ, కాశీ విశ్వేశ్వరుణ్ణి అరాధించు. అ భగవంతుడు నీ శోకాన్ని పోగొడతాడు' అని చెప్పేడు.

'మహమ్మదీయులేమిటి? హిందూదేవుణ్ణి కొలవడమేమిటి?' అని సందేహించకుండా సుల్తానా అ సన్యాసి చెప్పినట్టుగా కాశీ విశ్వేశ్వరుణ్ణి ప్రార్థించింది. విశ్వేశ్వరుడు అమె ప్రార్థన విన్నాడు. అమెకు చక్కని చుక్కలాంటి బాలిక పుట్టింది. అ బాలికకు లవంగి అని పేరు పెట్టేరు.

విశ్వేశ్వరునిపైన అమరిన భక్తికొద్దీ అమె హిందూ పండితుల్ని రప్పించి, సంస్కృత గ్రంథాలలో ఉండే శివమహాత్మ్యం చదివించి వినేది. లవంగి పెరిగి పెద్దఅయాక, అమెను తల్లి అ పండితులచేత చదువు చెప్పించింది. లవంగి సూక్ష్మబుద్ధి కలది గనుక కొదికాలంలోనే వేదశాస్త్రాలలోనూ, సంస్కృత భాషలోనూ గొప్ప పాండిత్యం సంపాదించింది.

పద్దెనిమిదేళ్లు వచ్చేసరికల్లా లవంగికి కాశీ విశ్వేశ్వరస్వామిని దర్శించాలనే కోర్కె పుట్టింది.

'హిందూదేవాలయంలోకి మనం వెళ్లటం యేమిటి? మనకి 'అల్లా' ఉండగా మరొకళ్ల దేవుణ్ణి మనం సేవించటంయేమిటి, అక్షేపణ కాదా?' అన్నాడు పాదుషా.

అందుకు లవంగి "నాన్నగారూ, 'మన' దేవుడేమిటి? 'వాళ్ల' దేవుడేమిటి? దేవుడొక్కడే. మనం 'అల్లా' అంటాము. హిందువులు 'ఈశ్వరుడు' అంటారు. మాట తేడా తప్ప మరేమీ లేదు. కనుక,

నన్ను వెళ్లనివ్వండి, స్వామిని దర్శించుకో నివ్వండి" అంది.

ఆ మాట పాదుషాకి నచ్చకపోయినా, ఒక్కగానొక్క కూతురు కావటంచేత మారుమాట చెప్పలేక ఒప్పుకొన్నాడు.

పాదుషా ఐతే, ఒప్పుకొన్నాడుకాని, దేశం లోని హిందువులు ఒప్పుకోలేదు. 'గుళ్లోకి తురకలపిల్ల రావటమా, ఇంకేమైన ఉందా? విశ్వేశ్వరుడు మైలపడిపోడా!' అని గోల బయల్దేరింది.

ఈ సంగతి పాదుషాకి తెలిసి మండి పడ్డాడు. "నా కూతురు మీ గుళ్లోకి వస్తా ననటమే చాలు! మీరడ్డుపెడతారా? ఎవ రడ్డుకుంటారో రండి. డొక్క చీల్చేయిస్తాను' అని చెప్పి, ఒక గొప్ప సేనను సాయం ఇచ్చి లవంగిని గుళ్లోకి పంపేడు.

ఈ సంగతి గోదావరీ మండలంలో ఉన్న జగన్నాథుడికి తెలిసింది. అప్పటికతనికి పాతికేళ్ల వయస్సు. మంచి బలమూ, పౌరు షమూ విజృంభించి ఉన్న వయస్సేమో అతనికి పాదుషా ప్రతిజ్ఞ తెలియగానే 'ప్రతి ఘటించే మొనగాడే లేడా హిందువుల్లో? పాదుషా కూతురు ఎలాగ గుడిలో ప్రవేశి స్తుందో చూస్తాను!' అని మారుప్రతిజ్ఞ చేసి,



కాశీకి బయల్దేరేడు. అతని నాయకత్వం క్రింద ఎంతో సేన బయల్దేరి, పాదుషాగారి సేనకు ఎదురుగా విడిసింది.

'పాదుషా సేన కయ్యానికి దిగుతే మీరు ఎదుర్కోండి. నేను ఆలయంలో గుమ్మంవద్ద స్వామికి కాపలా కాస్తూంటాను' అని చెప్పి, ద్వారపాలకునిమల్లే జగన్నాథుడు గర్భా లయంలో కత్తిపుచ్చుకు నిలబడ్డాడు.

లవంగి తనవంక వచ్చిన తురుష్క సేననూ, ఎదుటనున్న హిందూ సేననూ చూసి, 'నామూలాన వీళ్లంతా యుద్ధానికి దిగి ఒకళ్లనొకళ్లు నరుక్కు చావటం యేమిటి? మాట్లాడక ఢిల్లీకి పోతే ఏగొడవా



జగన్నాథుడు, 'ఎవడివయ్యా నువ్వు. చొక్కా తలపాగా తీసివెయ్యకుండా వస్తు న్నావు గుళ్లోకి! ఆగు ఆగు!' అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

మగవేషంలో ఉన్నా తన చేతిని అతడు పట్టుకోవడంవల్ల సిగ్గుచెంది లవంగి వెనక్కి తగ్గింది. జగన్నాథుడుకి ఆ వైఖరి చూసే సరికి అనుమానం తగిలింది.

కాని, ఇంతలో లవంగి తేరుకుని, 'అయ్యా, నేను చొక్కా తొడుక్కున్నం దుకు ఆక్షేపించారు మీరు. మీరు చూడగా బ్రాహ్మణుల్లాగ ఉన్నారు. బ్రాహ్మలెక్క డైనా ద్వారపాలకులై సేవకావృత్తికి పూను కుంటారా?' అంది.

'నేను సేవకుణ్ణి కాదు. వీరుణ్ణి! లవంగి అనే తురక చిన్నది బలవంతంగా ఆలయంలో ప్రవేశిస్తుందని తెలిసి, కత్తి పుచ్చుకుని కాపలా కాస్తున్నాను' అన్నాడు జగన్నాథుడు.

'జాలిగుండెతో ఉండవలసిన బ్రాహ్మలకి చేతిలో యీ కత్తి యేమిటి?' అని మళ్ళీ ప్రశ్నించింది లవంగి.

'బ్రాహ్మలైతే మాత్రం ఆయుధాలు పట్టకూడదా? పరశురాముడు మొదలైన

ఉండదుకదా!' అనుకుంది. కాని, ఇంత వరకూ వచ్చి విశ్వేశ్వరుణ్ణి చూడకుండా మరలిపోవటానికి మనస్కరించింది కాదు. రక్తపాతం లేకుండా కార్యం నెరవేర్చు కోవటం ఎలాగా అని ఆలోచించింది.

వెంటనే ఆమె ఒక ముఖమల్ ఇజారూ, కోటూ, తురాయి ఉన్న తలపాగా తెప్పించి, ఒక రాజపుత్రునికి మల్లే వేషం వేసుకుని ఎవరికీ అనుమానం తగలకుండా విశ్వే శ్వరుని ఆలయం ప్రవేశించింది.

దేవదర్శనానికి ఏ రాజకుమారుడు కూడా ఇలాగా కోటూ తలపాగా పెట్టుకు రారు. ద్వారంపద్ద కాపలా కాస్తూన్న

వారంతా పట్టలేదా? ఐనా, వాదోపవాదాలూ, శాస్త్రచర్చలూ తర్వాత సావకాశంగా చేద్దాం లెండి. యాత్రాపరులు వస్తున్నారు. మీరు వెళ్లండి' అన్నాడు జగన్నాధుడు.

'తిరావచ్చాను గనక విశ్వేశ్వరుణ్ణి ప్రార్థించి మరీ వెడతాను.' అంటూ, లవంగి విశ్వేశ్వరునిపైన దృష్టి సారించి భక్తిపారవశ్యంతో ఆశుకవిత్వంలో నాలుగు శ్లోకాలు చదివింది. ప్రతిశ్లోకంలోనూ ఆఖరున 'భవాబ్ధిజలే పతితాం అవ మాం కృపయా' అని ప్రార్థించింది. 'పుట్టుక అనే సముద్రంలో పడినదానను. నన్ను కృపతో రక్షించు' అని ఈ వాక్యానికి అర్థం.

'పురుషుడైతే పడినవాడను అంటాడుగాని పడినదానను అంటాడా? ఎవరో అమ్మాయే పురుషవేషంలో వచ్చిఉండాలి!' అని పసిగట్టేడు జగన్నాధుడు. నిర్మొగమాటంగా అడిగేశాడుకూడాను.

లవంగి గడుసుది గనక, 'అయ్యో, ఈ శ్లోకాలు నేను చెప్పినవి కావు. ఎవరో స్త్రీ రచించింది. నేను వల్లించుకున్నాను' అని చెప్పి, ఇంక అక్కడ ఉంటే తన గుట్టు బయలుపడిపోతుందని చెప్పేసి, చరచరా వెళ్లిపోయింది.




ఆవులిస్తే ప్రేగులు లెక్కించే చాకచక్యం గల జగన్నాధ పండితునికి ఆ వచ్చివెళ్లినది లవంగి అన్నసంగతి తెల్లమైపోయింది. ఆ పిల్ల సౌందర్యం, వాక్చాతుర్యం, పాండిత్యం, కవిత్వధోరణి ఇవన్నీ తలుచుకుంటూ అతడు తను కాశీ ఎందుకు వచ్చినదీ మరిచేపోయాడు. 'లవంగిఆలయంలోకే రాకూడదన్న జగన్నాధునికి 'లవంగిని పెళ్లిచేసుకోవాల'ని వాంఛ కలిగింది.

తన మకాంలోకి వెళ్లిపోయిన లవంగికి కూడా జగన్నాధుణ్ణి పెళ్లి చేసుకోవాలని గాఢమైన వాంఛకలిగింది. పాదుషా ఆమెకు అడ్డు చెప్పబోగా, 'నాయనా, స్వామి

సన్నిధిలో ఆయనకూ నాకూ మానసికమైన పాణిగ్రహణం జరిగేపోయింది, ఇప్పుడు నువ్వు 'వద్దు' అని యేం లాభం?' అన్నది.

ఇంక చెప్పవలసినదేముంది? ఒకళ్ల తలలొకళ్లు నరుక్కుందామనుకొని వచ్చిన రెండు సేనలూ, మగపెళ్లివారూ ఆడపెళ్లి వారుగా మారిపోయారు, విందులు జరిగినై.

ఈ పెళ్లితో ఒక కొత్త సిద్ధాంతం ఏర్పడింది. 'అల్లా అన్నా విశ్వేశ్వరుడన్నా ఒకడే. హిందువులూ, మహమ్మదీయులూ ఆ దేవునికి సమానమే. కనుక కలహాలు లేకుండా రెండు మతాలవారూ పెళ్లిళ్లు చేసుకోటం మంచిదీ' అని. ఐతేనేం. మహా పండితులైన లవంగి జగన్నాథులకు అర్థమైందికాని ఈ సిద్ధాంతం, తక్కిన వాళ్లకు నచ్చలేదు. నచ్చటం మాట ఎలా ఉన్నా, గొప్పకవీ, పండితుడూ ఐవుండి, "పండితరాయలు" అని బిరుదు సంపాదించుకున్న జగన్నాథుడంటే కిట్టనివాళ్లు అంతా చేరి, 'తురకపిల్లని పెళ్లి చేసుకున్నావు, కులభ్రష్టుడవు, మతభ్రష్టుడవు అపవిత్రుడవు' అని చెప్పి అతణ్ణి వెలేశారు.

జగన్నాథుడామాట విని ఫక్కున నవ్వి, 'ఓరి పిచ్చివాళ్ళల్లారా, నేను ఎంతమాత్రం అపవిత్రుణ్ణి కాదు, ఇదుగో చూడండి' అంటూ వాళ్లనందర్నీ వెంటబెట్టుకుని గంగ ఒడ్డుకి వెళ్లి నిలబడి ఆ మహాదేవిని స్తోత్రం చేస్తూ శ్లోకాలు చెప్పటం మొదలెట్టేడు.

ఆ స్నానఘట్టంలో నూరుమెట్లున్నాయి. గంగాదేవి, ఆ మహాభక్తుని స్తోత్రం విని ఆగి, ఒక్కొక్క శ్లోకానికీ ఒక్కొక్క మెట్టు చొప్పున ఎక్కుతూవచ్చి, నూరు శ్లోకాలూ పూర్తి అయేటప్పటికి లవంగినీ జగన్నాథుణ్ణీ తన హస్తాలలో చేర్చుకుంది. 'మిమ్మల్ని అపవిత్రులన్నవాళ్ళే అపవిత్రులు. ఆ అపవిత్రులమధ్యని మీరు ఉండనే వద్దు' అని చెప్పి ఆ పుణ్యదంపతులను తనలో ఐక్యం చేసుకొంది.





# మాయా పెట్టె

పూర్వం పాటలీపుత్రాన్ని చంద్రగుప్తుడు అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన విశాలమైన ఆ రాజ్యాన్ని రాష్ట్రాలుగా భాగించి, ఒక్కొక్క రాష్ట్రానికి ఒకొక్క అధికారిని నియమించాడు.

ఆయన నియమించిన అధికారులందరూ చక్కగానే పాలిస్తూ వచ్చారు. ఇటువంటి అధికారులు వుండటంవల్ల రాజుకీ కీర్తి వచ్చింది. కాని, విదర్భరాష్ట్రాన్ని పాలించే అధికారి మట్టుకు లంచగొండి అనీ, దుర్మార్గుడనీ పేరు పడ్డాడు. అందుచేత అతన్ని తొలగించి, ఆ స్థానంలో మంచివాణ్ణీ ధర్మపరుణ్ణీ నియమించాలని రాజు నిశ్చయించుకున్నాడు.

ఇంతలో కొంతమంది పెద్దలు రాజు వద్దకు వచ్చి "దేవరా! ఇక్కడికి పది ఆమడ దూరంలో ఒక అడవి ఉన్నది. ఆ అడవిలో పశువులను కాచుకునే గొల్లవాడున్నాడు. ఆ గొల్లవానిపేరు ధర్మన్న. వాడి బుద్ధిబలం యేమిటోగాని, ఎటువంటి పేచీ వచ్చినా శాస్త్రసమ్మతమైన చక్కటి తీర్పులు చెబుతాడు. అందుకనే ఇప్పుడు జనమంతా న్యాయంకోసం కచ్చేరీలకు పోవటం మానివేసి అరణ్యంలో ఉండే ఆ ధర్మన్నవద్దకే వెళుతున్నారు" అని మనవిచేశారు.

ఈ మాటలు వినేటప్పటికి రాజుకి ఆశ్చర్యం కలిగింది. "వెఱ్ఱిగొల్లవాడేమిటి, వానిపైనప్రజకు ఇంతటి విశ్వాసం కుదరడం యేమిటీ? వీడెవడో ఘనుడై ఉండాలె," అనితలిచి, ఎక్కడనో అరణ్యమధ్యమందు పశువులను కాచుకుంటూవుండే ఆ ధర్మన్నను తన ఆస్థానానికి రప్పించాడు. విలువైన దుస్తులు ఇప్పించి, వానినీ గద్దెపైన కూర్చుండబెట్టి "అబ్బాయీ, ధర్మన్నా!— నిన్ను గురించీ, నీ ధర్మగుణాన్ని గురించీ, న్యాయంగా తీర్పులు చెప్పటాన్నిగురించి

యస్. చంద్రమౌళి, మహబూబ్‌నగరు



మేము చాలావరకు విన్నాము. విని సంతో షించి, నిన్ను మా విదర్భరాష్ట్రానికి అధి కారిగా నియమిస్తున్నాం" అని చెప్పాడు రాజు.

"ప్రభూ!—తమరు నన్ను అభిమానిం చారే కాని, నా కంత శాహతు ఎక్కడిది? తెలివితేట లెక్కడివి? పైగా, నాబోటివాడు అధికారి అంటే లోకంలో నవ్వులాటగా కూడా వుంటుందే..." అంటూ, ఏమో అన బోయాడు. కాని, రాజు ఆజ్ఞను దాటడానికి ఎవరికైనా వీలవుతుందా? కాబట్టి, మారు మాట చెప్పకుండా రాజాజ్ఞను శిరసావ హించి, పదవిలో ప్రవేశించాడు, ధర్మన్న.



ఈపదవి వచ్చిన తరువాతకూడా ధర్మన్న తీర్పులనుగురించి ప్రజ అను కూలంగానే చెప్పుకోసాగారు. కాని, మరి కొద్దికాలానికే కొంతమంది రాజువద్దకు వెళ్లి "ప్రభూ!—ధర్మన్న ఇదివరకటి ధర్మన్న కాదు. అతనిబుద్ధి అప్పుడే మారిపోయింది. లంచాలు పట్టడం మరిగేశాడు" అంటూ ఫిర్యాదులు చేయసాగారు.

ఫిర్యాదులు వినగానే రాజు తొందర పడక, "అధికారం అనగానే అందరకూ ఆశగానే వుంటుంది. కిట్టనివాళ్లు తరుచు ఇటువంటి వదంతులనూ నీలాపనిందలనూ పుట్టించటం సహజం. కనుక కళ్లార చూస్తేగాని ఏమాటా నమ్మలేను" అన్నాడు.

"అయ్యో మహాప్రభూ! ఇవన్నీ వట్టి వదంతులనుకుంటున్నారు కాబోలు. అజమాయిషీకోసం ధర్మన్న ఏనుగను ఎక్కి వెళతాడు. ఆయనవెంట గుర్రాలపైన స్వారిచేస్తూ అంగరక్షకులుంటారు. ఇంత వరకూ బాగానేవుంది, హోదా నిలబెట్టు కోవటానికని ఇలా చేస్తున్నాడనుకుందాం. కాని, ఇద్దరు నవుకర్లు ఒక పెద్ద మాను పెట్టెను మోసుకుంటూ వెంటపోతూవుం టారే. ఇది యెందుకో ఎప్పుడైనా వాకబు

చేయించారా ఏలినవారు?" అని మళ్లీ ప్రశ్నించారు వాళ్లు రాజు మనసుకి నాటుకునేటట్టుగా.

పెట్టెమాట చెవిని బడటంతోనే ఈవింత యేమిటో ప్రత్యక్షంగా తెలుసుకోవాలనే కుతూహలంతో రాజు విదర్భకు స్వయంగా బయల్దేరాడు. ఆయన సగందారిలో ఉండగానే ఎక్కడికో అజమాయిషీకోసం వెళుతున్న ధర్మన్న, పరివారమూ కనిపించారు.



ధర్మన్న వెంట నవుకర్లు మోసుకపోతున్న మానుపెట్టె చూడగానే తను విన్న మాటలు నిజమేననీ, లంచాలసొమ్ము దాచుకోటానికే ఈ పెట్టె యేర్పాటైందనీ రాజుకి దృఢమైన వుద్దేశం పాటుకపోయింది. రాజు ధర్మన్నను పలకరించి, ఆ మాటా ఈ మాటా ఆడుతూ, "ఏమయ్యా ధర్మన్నా! నీవు మోయించుకువస్తున్న దస్తుశిస్తులు భారంగా ఉన్నట్టున్నయ్యే? ఏదీ చూదాం" అని చలోక్తిగా అంటూ ఆత్రంతో ఆ మాను పెటె మూత తీయించి చూశాడు.

చూడగా యేముంది?—ధర్మన్న ఈ అధికారానికి రాకముందు వేసుకుంటూ వుండే చింపిపాతలు తప్ప ఒక్క చిల్లిగవ్వ కూడా అగపడలేదు. అందరూ ఆశ్చర్యపోయారు. ఉండబట్టలేక రాజు ధర్మన్నను ఇదేమిటని అడిగేసరికి, "ప్రభూ! ఇప్పుడు నాకు పట్టిన నడుమంతరపు సిరివల్ల నాకు కళ్లు నెత్తిమీదికి రాకుండా ఈ గుడ్డలు నా పూర్వచరిత్రను జ్ఞప్తికి తెస్తూవుంటాయి. నా పూర్వచరిత్ర మరిచిపోతినంటే నాలో నీతికీ ధర్మానికీ తావుండదు. కాబట్టి నేను చెప్పే తీర్పులు న్యాయంగా ఉండవు. నా నిజస్థితి నాకు ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉండటానికే ఇలా చేస్తూవుంటాను" అని ధర్మన్న బదులు చెప్పాడు.

'సెబాస్, ధర్మన్న నిజంగా ధర్మావతారమే' నని రాజు మెచ్చుకొన్నాడు.




ఉరవకొండ గ్రామంలో ఉమాపతి అనే ఒక బ్రాహ్మడు ఉండేవాడు. ఆయన మంచి నిష్ఠాపరుడు. చుట్టుపక్కల వూళ్లల్లో ఏయే కాయధాన్యాలు పండుతున్నాయో, ఎక్కడ ఎంత సరకు నిలవ ఉంటున్నదో ఉమాపతి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, వాటికి బేరాలుతెచ్చి, కమిషను వ్యాపారం సాగించేవాడు. కనుక ఎవరికి ఏ దినుసు కావలసినా ఉమాపతిని ఆశ్రయిస్తే, అతడు మంచి సరకు చవుక ధరకు నిమిషాలమీద కొని పెట్టి, తన వంతు కమిషను తను తీసుకొంటూ ఉండేవాడు. ఈవిధంగా అతనికి కాలక్షేపం జరుగుతూ వచ్చింది. శ్రమపడి అన్ని సౌకర్యాలూ స్వయంగా సమకూరుస్తూ ఉండటంవల్ల ఉమాపతి పేరు చాలా దూరం పాకిపోయి, కొద్దికాలంలోనే అతనికి వ్యాపారంలో అనేకమంది ఖాతాదారులు ఏర్పడ్డారు.

ఇలా ఉండగా ఒకనాడు, హుసేన్ అనే కొత్త వర్తకుడు అతని కీర్తి విని, ఉరవకొండకు వచ్చి, వెతుక్కుంటూ వెళ్లి ఉమాపతిని ఇంటివద్ద కలుసుకొన్నాడు. "అయ్యా పంతులుగారూ! మాకీ యేభై బస్తా యేర్‌సెనగా కావాల్సివచ్చాం. యాపారం జరూర్గా జర్గావాలా, మీకీ కమిసన్ హెంతా హిస్కోవాలో హిస్కుంటాం" అన్నాడు, ఆత్రంగా.

అందుకు ఉమాపతి "సరే హుసేనూ, బాగానే వుంది. ఐదో పదో బస్తాలైతే పక్క ఊరిలో సద్దుబాటవును. కాని నీకు ఒకేసారి యాభై బస్తాలు కావాలంటున్నావే. అందుకని నాలుగైదు గ్రామాలు తిరిగి సరకు పోగుచేసుకోవలిసి ఉంటుంది. మనం తెల్లవారుఝామునే బయల్దేరి వెళదాంలే" అన్నాడు. ఇందుకు హుసెన్‌కూడా ఒప్పుకున్నాడు.

మహమద్ - ఆలీఖాన్; హైదరాబాదు



అనుకున్నప్రకారం ఉమాపతి కోడి కూయగానే లేచి, హుసేనును వెంటబెట్టుకుని బయల్దేరాడు. పొలంగట్ల వెంట రెండు కోసులు నడిచేసరికల్లా భళ్లున తెల్లవారింది. ఆ సమీపంలోనే పుష్కలంగా నీరున్న ఒక చెరువు కనపడగా, ఉమాపతి తనవెంటనున్న సాహేబుతో "అయ్యా, హుసేన్‌గారూ!— నే నీ చెరువులో స్నానం చేసి, సంధ్యవార్చుకుని ఒక్క అరగంట సేపట్లో వచ్చేస్తాను. అందాకా ఈ గట్టు మీద కూర్చోండి" అని చెప్పి వెళ్లాడు.



ఉమాపతి సంధ్య వార్చుకునే సమయంలో సాహేబు తనకూడా తెచ్చుకున్న చిన్న చదర గట్టుమీద పరుచుకుని నమాజు చేసుకుంటున్నాడు. ఇంతలో ఉమాపతి గట్టువద్దకు వచ్చి నమాజు చేస్తూవున్న హుసేనుని చూచి అతని మతదీక్షకు సంతోషించాడు. "పేర్లు తేడాకాని, ఏ మతస్థులు ఏరూపంలో కొల్చినా దేముడు అందరకూ ఒక్కటేకదా! నేను చేసే సాష్టాంగదండ ప్రణామమూ, ఈ హుసేను చేస్తున్న నమాజూ ఆ భగవంతునికే చెందుతుంది కదా! అహా, సృష్టికర్త పరిపాలన ఎంత చిత్రంగా వున్నది!!" అని ఈవిధంగా ఉమాపతి ఆ జగన్నాటకసూత్రధారుని పరిపాలనలోని సర్వసమత్వానికి అబ్బురపడజొచ్చాడు.

ఇలా అతను ఆలోచిస్తూవుండగా అదృష్టవశాత్తు అక్కడనే ఒక చిన్న తులసిమొక్క అగపడేసరికి, ఉమాపతి ఎంతో సంతోషించి అపరిమితమైన భక్తితో ఆ మొక్కవద్ద స్థలం బాగుచేసి, తాను తెచ్చిన చెంబుడు నీళ్లలో సగం దాని మొదట్లో పోసి నమస్కరించాడు.

ఇంతలో నమాజు ముగించుకువచ్చిన హుసేను సాహెబు ఉమాపతి చేస్తున్న పని చూచి వికటంగా నవ్వుతూ, "హేమి ఓయి




హుమా పతీ !—మొక్కల్కీ మోడుల్కీ మొక్కుతార్ మీరు, హేమీ మతం హెూయ్ మీదీ !" అంటూ ఎగతాళి చేశాడు. పంతులు కొంచెమైనా కోపం తెచ్చుకోకుండా "హుసేనుగారూ !—మా దేవుడైన నారాయణుడూ, ఆయన భార్య లక్ష్మీదేవీ ఈ తులసిచెట్టు రూపంలో వుంటారని మా హిందువుల నమ్మకం. అందుకనే ప్రతి ఇంటా మావాళ్లు అందమైన తులసికోటలు కట్టించి, వాటిల్లో తులసిమొక్క వేసి రోజూ పూజిస్తారు. నిజానికి తులసిమొక్క లేని హిందూ గృహం ఉండనేవుండదు. ఈ తులసిపూసల పేరులుకూడా మెడలో ధరిస్తారు" అంటూ పవిత్రమైన తులసిని గురించి చాలవరకు చెప్పాడు.

ఇంత చెప్పినా సాహేబుకి ఇందులో ఒక్క మాటా నచ్చలేదు. నచ్చకపోతే పోవచ్చు. ఎవళ్ల నమ్మకం వాళ్లది అని ఊరుకుని, తన వ్యాపారం సంగతి ఏదో తను చూచుకోకూడదూ? ఊహుఁ. అలా చేయక, హుసేను ఆవేశంతో "హేఫ్టీ, మొక్కాలో దేమ్డూ హుంటార్ ! హేడీ, మీ దేమ్డూ, హేఫ్టీ చేస్తాడో సూస్తాం !" అని అంటూ ఆ తులసి చెట్టుని ఊడబెరికి, ఆకులన్నీ తుంపిపోసి ఆ చేతికి అంటిన పసరు వంటికంతటికీ పూసుకొన్నాడు. "హేడీ వోయ్ మీ దేమ్డూ హేఫ్టీ చేశాడు వోయ్ మమ్మల్ని ?" అని మీసం గడ్డం సద్దుకుంటూ గర్వంగా ప్రశ్నించాడు. ఇటువంటి వాళ్ళని ఎంతోమందిని చూచుకువస్తూన్న అనుభవశాలి గనుక ఈ అవమానానికి పంతులు ఎంతమాత్రమూ కోపగించుకోలేదు. 'కీలెరిగి వాతపెట్టు' మనే పెద్దల వాక్యం గుర్తు వచ్చిందతనికి. సమయం చూచి హుసేనుకి గట్టిగా బుద్ధి చెప్పాలని నిశ్చయించుకుని, అదును కోసం వేచి వున్నాడు.



మరొక్క మైలుదూరం సాగిపోయే టప్పటికి తుప్పలలో ఒక దూలగొండి మొక్క పంతులి కంటబడింది. అతడు పరమానందభరితుడైనాడు. యుక్తిపరుడైన ఉమాపతి గబగబ ఆ తుప్పలలోకి పోయి, మొక్క వుండే జాగా చుట్టూ శుభ్రం చేసి, తన చెంబులో మిగిలివున్న తక్కిన సగం నీళ్లూ దాని కుదుట్లో పోసి, మొక్క చుట్టూ గిరగిర గిరగిర తిరిగి, భక్తితో ప్రదక్షిణాలు చేయనారంభించాడు.



నీరెండకు ఆ దూలగొండిమొక్క నూగు నిగ నిగ మెరిసిపోతూ చూడ ముచ్చటగా వుంది. ఆ మొక్కకు నమస్కరిస్తున్న ఉమాపతిని చూచి సాహేబు, "హేమయ్యో పంతులూ! హడుగడుక్కీ మొక్కల్కూ దండాలు పెడ్తావుంటావు. నీకేమన్నా పిచ్చి పట్టిందా?" అని అంటూ ఇదివరకటి మోస్తరుగానే గేలిచేశాడు.

అందుకు పంతులు "ఏమయ్యోవ్ సాహెబుగారూ! ఆ తులసి మొక్కకంటె కూడా ఇది మా హిందువులకు అతి పవిత్రమైంది. దీనిని మేము 'కండూతి కల్పతరువు' అని అంటాము. ఈ మొక్కలో దేముడు ప్రత్యక్షంగా కని పిస్తాడుకూడాను. ఏదో ఇవాళ నా అదృష్టం కొద్దీ ఇది కనిపించింది. నేను ఇప్పుడు భక్తితో ఆరాధించి, భగవంతుణ్ణి సాక్షాత్కరింప జేసుకోవాలి గనుక కాస్సేపు నిశ్చలంగా జపం చేసుకోనియ్యి. అలాగా ఇలాగా అని ఈ విషయంలో నువ్వు దూషించావంటే మటుకి నేను సహించను సుమా," అని హెచ్చరించాడు.

ఉమాపతి చేసిన హెచ్చరిక మాటలు సాహేబుని మరింత ఉసికొల్పినై. హుసేనుకు అపరిమితంగా ఉద్రేకం రేగింది. గభీమని ఆ మొక్కను బలంకొద్దీ రెండు చేతులా బలవంతాన పీకి, కసితీరేట్టు అకు



లన్నీ దూసి బాగా నలిపి, పసరు వళ్లంతా పూసుకొని, అప్పటికీ కోపం తీరక మొక్కను కాళ్లకింద వేసి తొక్కి వేయజొచ్చాడు!

సాహెబు చేష్టలన్నీ చూస్తున్న పంతులు కిక్కురుమనలేదు. ఒక్క ఐదు నిమిషాలయేసరికి హుసేనుసాహెబుకి దురదామంటా మొదలెట్టినై. గోక్కోవటం ప్రారంభించాడు. శరీరమంతా పట్టుకొన్నదాయె దురద, ఎక్కడని గోక్కోవటం! అంతకంతకు బాధ ఎక్కువై, సాహెబు జోరీగల గొడ్డులాగా గెంతులేయసాగాడు. మరొక్క పది నిమిషాలయేసరికి అతనికి తారకాలంటుకున్నాయి. బాధ భరించలేక "హేమ్టీ వోయ్ పంతులూ!—అరే హల్లా!!" అంటూ అతడు బొబ్బలుపెట్టేసరికి, తళుకూ బెళుకూ లేకుండా పంతులు, "వోయి హుసేనుగారూ! ఇదే మా దేవుని మహిమ, అయన ప్రత్యక్షం కాబోయేముందు భక్తులు ఏపాటి నిలకడగా ఉండగలరా అని ఈవిధంగా పరీక్షిస్తాడు. పరీక్షకు నిలబడగలిగినవాళ్లకు ఆ మహానుభావుడు ప్రత్యక్షమవుతాడు. లేకుంటే లేదు" అని చెప్పాడు.

శివమెత్తినవానిలాగా చిందులు తొక్కుతూవున్న హుసేను "అరె, మాకీ పచ్చెచ్చం అక్కల్లేదు ఓయ్, పంతులూ!—నీకీ పలాం షేస్తాం, మీ దేముడ్కి పామ్మని సెప్పువోయ్ పంతుల్!' అంటూ కాళ్లావేళ్లా పడి బతిమలాడాడు.

పంతులు జాలిపడి, పక్కవూరు చేరుకోగానే సాహెబుకి చికిత్స చేయించాడు. అతనికి బాధ తగ్గింది. తరువాత హుసేనుకి కావలసిన వేరుసెనగకూడా అక్కడనే అమరింది. అందుచేత అతని ఉత్సాహానికి మేరలేకపోయింది.

నాటినించీ హుసేనుకి దేముడంటే భయమూ, భక్తీ, విశ్వాసమూ కుదిరినై. అతడు ద్వేషం మాని 'ఎవరి మతం వాళ్లకి గొప్పది" అంటూ ఉండేవాడు.



# సివంగి కుంటుతూ నడుస్తుంది



# ఎందుకో తెలుసా?

ఒకనాడు దుమ్ములగొండి (సివంగి) అడవిలో చల్లగాలికి షికారు బయల్దేరే సరికి కుందేలు ఎదురువచ్చింది. "కుందేలు బావా! కుందేలు బావా!—వినవలసిన వింతలూ, విశేషాలూ ఏమైనా ఉంటే చెప్పు" అన్నది సివంగి.

"వింతలు లేకేమి? ఇవాళ నేనొక చిత్రమైన జంతువును చూచాను సుమా" అని చెప్పింది కుందేలు. ఈ మాట విన్నప్పటి నించీ సివంగికి కుతూహలం ఎక్కువై, ఆ చిత్రమైన జంతువు ఎలా వుంటుందో చెప్పమని కూర్చుంది.

అందుకు కుందేలు "ఏం చెప్పమన్నావ్. ఆ జంతువుకి కాళ్లున్నాయికాని గోళ్లు లేవు. గోళ్లుదాకా ఎందుకు, అసలు వేళ్లే లేవు. పైగా దాని పాదాలు చెట్టుపలక లాగా రెండుగా చీలి ఉంటై. పోతే, మనం మనసులో ఏ రంగు తలుచుకుంటే ఆ రంగు దాని ఒంటిమీద కనిపిస్తుంది. మరొక గమత్తు ఏమిటంటే: అది ఒక కంటితో ముందుకీ రెండోకంటితో వెనక్కీ చూస్తుంది" అంటూ ఇంకా ఏమో చెప్పబోతుండగా, సివంగి పకపక పకపక నవ్వసాగింది.

ఇంతకూ ఆ కుందేలు తొండనుగురించి ఇంత గొప్పగా వర్ణించి చెప్పిందని సివంగి బుర్రకు స్ఫురించనే లేదు. కుందేలు చెప్పిన మాటలు దాని మనసుకి బాగా పట్టిపోయి, ఈ సంగతి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అది అదేపనిగా నవ్వేది. క్రమంగా ఈనవ్వు దానికి ఒక అలవాటై పట్టుకుంది.

సివంగి ఇలా పిచ్చిగా నవ్వటం చూచి, తోడిజంతువులు దీనిని వెర్రివెంకటాయిగా ఎంచనారంభించాయి. తోడిజంతువులు వెక్కిరించేసరికి దానికి కోపం వచ్చి పౌరుషం రేగింది. ఇప్పటికీ అసలు సంగతి తెలుసుకోలేని అమాయకపు సివంగి

ఈ నెల బహుమతి పొందిన కథ — ఆర్. వినాయకరావు, గుంటూరు

* బహుమతిగా జనవరి '51 నుంచి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

"ఏమిటి ఈ పిచ్చి నవ్వు? ఎందుకు వస్తున్నదో నాకే తెలియకపోయె! ఆ రోజున షికారుకు పోతూవుండగా కుందేలుబావ వచ్చి చిత్రం చెప్పింది. ఆ మాయమాటలు విన్నప్పటినించీ నాకు ఈ వెర్రినవ్వు ప్రారంభమైనట్టుంది. ఎంత ప్రయత్నించినా ఈ నవ్వు మానలేకుండా వున్నాను" అని విచారించింది. కాని చేయగలదేముంది?

మరిఒక రోజున కుందేలు మళ్ళీ ఎదట పడేవరకు, అది చేసిన మోసాన్నిగురించి కడుపులో ఉన్నదంతా వెళ్ళగక్కి, సివంగి "తొంటరికాళ్ళూ నువ్వూ బాగానే ఉన్నావులే!" అంటూ వెక్కిరించింది.

ఈ మాటకు కుందేలు కోపగించుకుంది; కాని పైకిమాత్రం ఏమీ అనకుండా అప్పటిమట్టుకి ఊరుకుంది. మళ్ళీ ఒకనాడు అది సివంగిని షికారుకు బయల్దేరదీసి, ఒక రహస్య ప్రదేశానికి తీసుకువెళ్ళి, మధ్యదారిలో 'కళ్ళు మూసుకుని ఎవళ్ళు వెనక్కి నడవగలిగితే వాళ్ళు గెలిచినట్టు" అన్నది. తెలివిలేని సివంగి కుందేలు వేసిన పందెం ప్రకారం కళ్ళు మూసుకుని వెనక్కి నడపసాగింది. పోయి పోయి అది ఒక లోతైన గోతిలో మరి లేవలేకుండా పడిపోయింది. అప్పుడు కుందేలు వెళ్ళి చేయి ఆసరాయిచ్చి లేవదీసేసరికి కుంటుకుంటూ అడుగులు వేయజొచ్చింది. చూడగా దాని వెనక కాళ్ళు రెండూ విరిగిపోయి ఉన్నై.

అప్పుడు కుందేలు దానితో "వోయి వెర్రిబావా! సివంగి బావా!—నేను తమాషాకు చిత్రమైన కథ చెబితే, నన్ను అర్థం చేసుకోలేకపోయావు. అపోహపడ్డావు. నామీద ఫిర్యాదు చేశావు, నన్ను వెక్కిరించావు. ఇప్పుడు నీ నడకా నువ్వూ బాగా ఉన్నావా? తొంటరి కాళ్ళు ఎవరివో వెనక్కి తిరిగి చూచుకో!" అని వేళాకోళం చేసింది. నాటినించీ పాపం, సివంగికి వెర్రినవ్వూ, వెనుకకాళ్ళ కుంటీ ఏర్పడిపోయినై.








పోలీసు : ఏయ్, సైకిల్! ఆగు. లైటేది?
కుర్రవాడు : ఎలా ఆగనూ? బ్రేకులు లేవే!



కొంటెపిల్లవాడు : ఏయ్ మంగలి! నువ్వు కోతి కెప్పుడైనా క్షవరం చేశావ్?
మంగలి : లేదే! నువ్వు కూచో, చేసి చూపుతా!



ఇన్‌స్పెక్టరు : నీ పేరేమిటిరా అబ్బాయ్?
విద్యార్థి : ఏ పేరండీ? మా అమ్మ పెట్టినదా, మా నాన్న పెట్టినదా, మా తాత పెట్టినదా?
ఇన్‌స్పెక్టరు : ఇళ్లో నిన్ను పిలిచే పేరు.
విద్యార్థి : చీమిడిముక్కండీ!



గిరి : ఏంరా హరీ, అలాగున్నావేం?
హరి : ఏం లేదురా, పుస్తకాలు కొనుక్కోవాలి, డబ్బు పంపమని రాస్తే, మానాన్న పుస్తకాలే కొనిపంపాడు.

## పాత పాటలు

(సేకరణ : టేకుమళ్ళ కామేశ్వరరావు)



వీధిలో ఇల్లైన విప్పచెట్టయిన
వియ్యంకుడన్నయ్య! విచారమేల?
గాలిలో వడ్లైన గంభీరమైన
ధనికుడు భర్తయిన లేవు చింతల్లు.

* * *

కృష్ణా! కృష్ణా! యంచు వాయపెట్టాము
కష్టాలు లేకుండ గడుపుమో స్వామి!
కృష్ణమ్మ నీతోడు చెల్లెలిని నేను
కష్టాలు లేకుండ గడుపుమో స్వామి!
తోడివారు పదిమంది నేనొక్కదాన్ని
తోడుపడు కృష్ణమ్మ తోటలలోన!
ఈడువారు పదిమంది నేనొక్కదాన్ని
ఈడుపడు కృష్ణమ్మ ఈరభూముల్ల!
పాలేర్లు పదిమంది నేనొక్కదాన్ని
పాలుపడు కృష్ణమ్మ పంటభూముల్ల!

* * *

అత్త చస్తే కోడలేమనీ యేడ్చు?
అడవి మల్లెలు పూచె నాయాట సాగె.
కోడలు చస్తే అత్తేమనేడ్చు?
కొండగోగులు పూసె నా గోల తీరె.

* * *

ఆముదాలు పండిన చేను చూడండి
ఆడవారిగన్నతల్లి అంశ చూడండి.
గోధుమలు పండిన చేను చూడండి
కొడుకులగన్న తల్లి గోల చూడండి.

## వినోదచదరం

| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |
| 7. | | | |

ఈ క్రింద యిచ్చిన ఆధారముల సహాయంతో పై చదరాన్ని పూర్తి చెయ్యాలి. సరీగా పూర్తిచేసినట్టయితే ప్రతి మాటలోని చివరి రెండు అక్షరాలు ఒకేమాదిరిగా వస్తయ్.

ఆధారములు :

1. పులి
2. చిలుక
3. కాకి
4. గుడ్లగూబ
5. బరువు
6. దుఃఖము
7. బురద

తెలియకపోతే జవాబు 55-వ పేజీలో చూడండి.




## పేకముక్క గులాబిపువ్వుగా మారటం

ఈ ట్రిక్కు చేయగలుగుతామని నిజానికి మీరు నమ్మటంలేదు కదూ? అవును, అసలు కిటుకు తెలిసేవరకూ మీరు నమ్మనే లేరు. తీరా రహస్యం తెలుసుకున్నాక మటుకు ఎంతో ఆశ్చర్యపోతారు.

పేకముక్కను అరచేతిలో పట్టుకుని అంకెలున్న వైపు ప్రేక్షకులకు చూపుతాడు ఇంద్రజాలికుడు.



ప్రేక్షకులు బాగా పరీక్షగా చూచుకున్న తరువాత ఇంద్రజాలికుడు పేకముక్కవున్న అరచేతిని రెండవ చేతితో మూసి, మరుక్షణమే చెయ్యి తీసివేస్తాడు. చిత్రం! పేకముక్క మాయమయి దాని స్థానంలో ఒక గులాబిపువ్వు ప్రత్యక్షమవుతుంది. 'ఇది ఎలా సాధ్యం?'

అదే యిప్పుడు చెప్పబోతున్నాను: ప్రేక్షకులకు నీవు చూపే పేకముక్క మామూలు పేకముక్క కాదు. ఇంటిదగ్గర ముందుగా నీవు తయారుచేసి తెచ్చుకున్న పేకముక్క. ఇది ఎలావుండాలో బొమ్మలో చూడు. పేకముక్కను అడ్డంగా మూడు సమభాగాలుగా మడతపెట్టు. తర్వాత వెనుకవైపు మధ్యభాగంలో, సిల్కుతోగానీ, సెల్యూలాయిడ్‌తోగానీ చేసిన ఒక గులాబిపువ్వు అంటించు. (ఇలాంటి గులాబిపువ్వులు ఎక్కడ దొరుకుతాయో యిదివరకే మీకు తెలుసు). ఇలా తయారుచేసుకున్న పేకముక్కతో సభకు వస్తావన్న మాట.

సభకు వచ్చాక మడతలు లేకుండాచేసి పేకముక్కను, అంకెలున్న వైపు ప్రేక్షకులకు చూపు. వారు చూచుకున్నతర్వాత, నీ రెండవ చేతితో ఆ ముక్కను మూస్తూ, కిందిభాగాన్ని బొటన

(వేలితోనూ పైభాగాన్ని చూపుడు (వేలితోనూ మడతపెడుతూ, పువ్వు అంటించివున్న వైపు ముందుకు వచ్చేట్టు తిప్పు. ఇదంతా రెప్పపాటు కాలంలో జరగాలి. ఇలాచేసి నీ అరచేతిని తీసివెయ్యి. పేకముక్కకి బదులు గులాబిపువ్వు కనిపిస్తుంది.

ఈ ట్రిక్కు చేసేటప్పుడు గమనించవలసిన విషయాలు రెండేరెండు: నీవుపెట్టే మడతలు (ప్రేక్షకుల కంటికి కనుపించనంత సున్నితంగా వుండాలి. తర్వాత పేకముక్కని మడతపెట్టేటప్పుడు (ప్రేక్షకులకు అనుమానం కలగటానికి వీలు లేనంత చాకచక్యంతో, ఒక్క చిటికెలో మడతపెట్టాలి.



ఇదీ ఏమంత కష్టం కాదు. ఒకటి రెండు సార్లు చేసిచూస్తే ఈ ట్రిక్కు అనుకున్నంత కష్టం కాదని మీకే తెలుస్తుంది.

ఇదేవిధంగా పేకముక్కని రైలుటిక్కెట్టుగానూ, నిప్పుపెట్టెగానూ కూడా మార్చవచ్చు. వీటన్నింటికీ ఒకటే మంత్రం.

[పాఠకులు, ఈ గారడినిగురించి నలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ (ప్రొఫెసరుగారికి (వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే (వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

(ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,

పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)



## ఆధారములు

| అడ్డము: | నిలువు: |
|---|---|
| 2. శ్వానము | 1. వెల |
| 4. ఇరవై దస్తాలు | 2. ఖరద |
| 6. చందమామ | 3. ఎలుకకు వైరి |
| 7. జింకవంటిది | 5. మూడుపేరులు |
| 8. చుక్క | 6. కరుణ |
| 9. యిష్టము | 10. కంబళి |
| 12. వర్షము | 11. పడవ |
| 14. ఉదయము | 13. గిరి |
| 16. జుట్టుముడి | 14. కుక్క |
| 17. కొల్లగొట్టుట | 15. ఒకప్రక్క |

తలిదండ్రులను దర్శించి, వారిని ఊరడించిన వెంటనే, శ్రీకృష్ణుడు తన తాత గారైన (కంసుని తండ్రి) ఉగ్రసేనుణ్ణి రాజ్యాభిషిక్తునిగా చేశాడు. ఇంతకుముందు కంసునికి భయపడి నానాదేశాలకూ చెదరిపోయిన స్వజనాన్ని మళ్లీ రప్పించి, సత్కరించి, వారికి కావలసినంత ధనమిచ్చి, వారు సుఖంగా ఉండేటందుకు తగు యేర్పాటులన్నీ చేశాడు. లోగడ కంసునివల్ల యమయాతనలు పడుతూ వచ్చిన యాదవులందరూ ఇప్పుడు శ్రీకృష్ణుని దర్శనంవల్ల కృతార్థులమయామని సంతోషించారు. తరువాత, కృష్ణుడు తనను పెంచి పెద్దచేసిన యశోదా నందనులను, గోపాలురతోసహా రేపల్లెవాడకు పంపించి, అక్కడ వారికి సమస్తమైన సౌఖ్యాలూ సమకూర్చాడు.

ఇక్కడ వసుదేవుడు తన ముద్దుబిడ్డలైన కృష్ణబలరాములకు గర్గునిచేత శాస్త్రోక్తవిధానంగా ఉపనయనాది సంస్కారాలు జరిపించాడు. వారు అయనవల్లనే గాయత్రి ఉపదేశంకూడా పొందారు. శ్రీకృష్ణ బలరాములు అన్ని విద్యలూ తెలిసిన సర్వజ్ఞులే ఐనప్పటికీ నరవేషం దాల్చివున్న అవతారమూర్తులు కాబట్టి, లోకంకోసమని గురుకులవాసం చేసి, విద్యాభ్యాసం చేయదలిచారు.

ఈ సంకల్పంతో కృష్ణబలరాములు కాశీపట్టణానికి పోయి, అవంతీపురంలో వుండే సాందీపనుడనే మహావిద్వాంసుణ్ణి ఆశ్రయించి, అయనకు శుశ్రూష చేయ నారంభించారు. ఈ శిష్యులసేవకు సాందీపనుడు చాలా సంతోషించి, సమస్త వేదములు, వేదాంగాలు, ధర్మశాస్త్రాలు మొదలైన విద్యలు బోధించాడు. విద్యలలో గల మర్మాలు, రాజనీతులలో ఉండే రహస్యాలు వెల్లడించాడు. అయన ఇంత శ్రద్ధగా చదువు చెప్పినందుకు శిష్యులున్నూ, ఒక్కతూరి విన్నంతమాత్రాన చక్కగా గ్రహించి, గురువు శ్రమను సారకం చేస్తూవచ్చారు.

పజిలుకు జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 ఖు | | | | 2 ఊ | 3 పి | రి |
| 4 రీ | 5 ము | | 6 జా | బి | ల్లి | |
| 7 దు | ప్పి | | లి | | | |
| | 8 రి | క్క | | 9 శ్రీ | 10 తి | |
| | | | 11 నా | | 12 వా | 13 న |
| | 14 పే | 15 కు | వ | | 16 సి | గ |
| 17 దో | పి | డి | | | | ము |

వినోద చదరానికి జవాబు :

| | | | |
|---|---|---|---|
| 1. | మె | క | ము |
| 2. | శు | క | ము |
| 3. | కా | క | ము |
| 4. | ఘూ | క | ము |
| 5. | తూ | క | ము |
| 6. | శో | క | ము |
| 7. | పం | క | ము |

## "ఎందుకో తెలుసా?"



"సివంగి కుంటుతూ నడుస్తుంది ఎందుకోతెలుసా?" అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలలోకల్లా ఉత్తమంగా వున్న కథని ఈ సంచికలో ప్రచురించాం. ఈ రచన పంపినది చి॥ ఆర్. వినాయకరావు, గుంటూరు. బహుమతిగా యితనికి జనవరి 51 నించి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుచున్నది.

వచ్చేనెల (ఫిబ్రవరి '51) కు
'ఏదుపందికి ఒళ్ళంతా ముళ్ళే!'
ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. రెండు పేజీలకు మించకుండా వుండాలి. కథలు ఫిబ్రవరి 15-వ తేదీలోగా మాకు చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు 1686, మదరాసు-1




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (ఫిబ్రవరి) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor SRI CHAKRAPANI
Printed and Published by B NAGI REDDI at the B N K Press, Madras-1



Chandamama, January '51

Photo by R. Krishnan

గేదెల స్నానాలు

CHANDAMAMA (Telugu) JAN. 1951 Regd. No. M. 4854




"నాకు రెండూ. నికొకటి!"